మీ పెరటిలో పెన్నిధి

Acc. No. 14717

# శ్రీ తులసి




గ్రంథకర్త

'సాహిత్య విద్యాప్రవీణ'

వైద్య విద్వాన్' 'భాషాప్రవీణ' 'హిందీ విశారద'

అన్నదానం చిదంబరశాస్త్రి,

M. A. & M. A. P. O. L.

ప్రకాశనము

శ్రీ హనుమదాధ్యాత్మిక కేంద్రము

ఆరేపల్లి అగ్రహారం-522309

This Book is Published
with the financial assistance
of
Tirumala Tirupathi Devastanam
under their scheme Aid to
Publish religious Books

## -: విషయ సూచిక :-







శ్రీరామ

జై హనుమాన్

# పితృవందనము



"ఈ రూపునీయఁగని నా
కీరతిగ మంచి నెంచు నింగిత మిడు సీ
తారామాంబా లక్ష్మీ
నారాయణులన్ పితరుల నమములఁగొలుతున్."

# మనవి

రోజు రోజుకూ మంచి అడుగంటిపోతోంది. చెడు ఆకాశాన్నంటుతోంది. ఎవరికి కష్టం వచ్చినప్పుడు వారు చెడునుగూర్చి బాధ వ్యక్తం చేయటం తప్ప తాము చేసేదానిని పరిశీలించుకొనేవారు లేరు. ధర్మాచరణ తక్కువై అధర్మం అనేక రూపాలలో అభివృద్ధి అవుతోంది. అందువల్లనే నిద్రలేచింది మొదలు దురదృష్టకరములు హృదయవిదారకములుఅయిన సంఘటనలే వింటున్నాము. దీనంతటికి కారణం పాపభీతి లేకపోవటం. దాన్ని గ్రహించకపోగా పాపపుణ్యాలే లేవనే ప్రచారాలు పెరిగిపోతున్నాయి. 'ఎవరో బయలుదేరి ధర్మోద్ధరణచేస్తారు. మనం చేయవలసిందేమిలేదు' అనుకోవటం ధర్మద్రోహం. ప్రతివారూ శక్తి కొలది ధార్మిక కృషిచేయవలసిన సమయ మిది. ఏ ఒక్క ధార్మిక సంస్థో సమాజంలోని ఈ దోషాన్నంతనీ పోగొట్టలేదు. ప్రతి ఇల్లూ ఒక ధార్మిక కేంద్రం కావాలి. అవకాశమున్న మార్గంలో ధార్మిక ప్రచారం చేయాలి. అందుకే మా సేవ నీరీతిగా అందిస్తున్నాము. వ్యక్తి వ్యక్తివద్దకూ వెళ్లి చెప్పలేకున్నా పుస్తకరూపంలో అనేక వ్యక్తులవద్దకు విషయం అందించవచ్చు కాబట్టి 'శ్రీ హనుమదాధ్యాత్మిక కేంద్రం' నుండి ఇట్టి ఆధ్యాత్మిక ప్రచారాన్ని చేయ సంకల్పించాము. సమాజానికవసరమైన ముఖ్యమైన విషయాలెన్నో అందించాలనే ప్రణాళిక ఉన్నది. అది మీరిచ్చు ప్రోత్సాహమునుబట్టే సాగుతుంది. పాఠకులందరూ మేమందించు విషయాన్ని గ్రహించి అవకాశమున్నంతవరకు ఆచరించి తోటివారికి కూడా తెలియజేయాలని మా ఆశ. గ్రంథమునకు ముందుమాట నందించిన మాననీయ శ్రీ ఎక్కిరాల భరద్వాజగారికి, పుస్తకమీరీతిగా వెలువడుటలో ప్రత్యక్ష పరోక్ష కారకులందరకు వందనములు.

— గ్రంథ ప్రకాశకులు.

గ్రంథ ముద్రణకై పేపరు సహాయం మొనర్చిన
శ్రీ రాయలసీమ పేపరుమిల్స్ జనరల్ మేనేజరు
మహారాజశ్రీ జి. కె. వెంకటేశ్ గారికి
కృతజ్ఞతలు.

## ముందుమాట

సామాన్య మానవులకు సృష్టిగురించి తెలిసేది చాలతక్కువ. కారణం తెలియడానికి అవసరమైన యోచన ఎక్కువమందికి వుండదు. ప్రతివాడు యోచించగలనను కుంటాడు గాని కొన్ని వూహాలు, స్మృతులు మనసులో మెదుల్తూ వుంటే వాటిలో ఏవి ఇష్టమైనవో ఆచరింప జూస్తాడు. ఇదే యోచనను కుంటాడు.

"నాన్నా! అన్నివస్తువులూ క్రిందకేఎందుకువస్తాయి" అని అడిగిన పిల్లవాడితో "ఏం ప్రశ్నరా యిది? వెధవ ప్రశ్న నువ్వూనూ క్రింద పడక పోతే పైకి ఎగురుతాయటరా?" అంటాడు ప్రతి తండ్రి. అలాకాక "భూమికి అన్నివస్తువులనూ ఆకర్షించే శక్తివున్నది" అని ఎవరన్నా సమాధానం చెప్పినా, అదీ తాను పాఠశాలలో విన్న విషయాన్ని చిలక పలుకులలా వల్లించిన మాటే గాని తానాలోచించి పరిశీలించి చెప్పిన సమాధానం కాదు. చరిత్రలో అలా స్వతంత్రంగా ఆలోచించి, పరిశోధించి, సామాన్యులకు గోచరం కాని సత్యాలను వివరించి చెప్పే మేధావులు ఏకొద్ది మందో వుంటారు. అట్టి కొద్దిమందిని తక్కిన మానవజాతి యావత్తు, "మనం ఆధునికులం. మానవుడీయుగంలో ఎంతోశాస్త్రీయ ప్రగతిని సాధించాడు ఈయుగంలో మూఢనమ్మకాలకు తావులేదు." అని ఆగొప్పను అందరికీ ఆపాదించి అదే సత్యమని మూఢంగా నమ్ముతుంది. సామాన్యులెంత ఆలోచించలేరో తెలియాలంటే "అందమంటే ఏమిటి?" అని ప్రశ్నించాలి. ఏది మననాకర్షిస్తుందో అదే "అందం" అని వెంటనే సమాధానం చెప్తారు. అంటే వారికాప్రశ్న కూడ సరిగా అర్థం కాలేదని తెలుస్తుంది. ఆ ప్రశ్నకు "ఏ లక్షణాలు

గల వస్తువు మన నాకర్షిస్తుంది'' అని అర్థం. అక్కడ నిలిచిపోయి జీవితంలో మొట్ట మొదటి సారిగా యత్నిస్తారు సామాన్యులు. గట్టిగా అడిగితే గుడ్లప్పగించి ఎలాఆలోచించాలో తెలియడంలేదని గానీ, లేక అలా ఆలోచించ యత్నిస్తే మనసు నిరామయంగా వుంటుందని గాని చెప్తారు. మనిషి యింత గుడ్డిగా బ్రతుకు తుంటాడు గనుకనే సామాన్యంగా ప్రకృతిలోనూ జీవితంలోను వుండే సౌందర్యం పట్ల అంధుడిగా వుండి పోతాడు. ప్రతిభావంతులైన ఏ కొద్ది మంది కళాకారులో, తాత్వికులో శాస్త్రజ్ఞులో అట్టి సౌందర్యాన్ని, విశిష్టతనూ వివరించినపుడు అతి స్వల్పంగానైనా అది చదివిన వారిలో ప్రజ్ఞ మేల్కొంటుంది. ఒక వంక విజ్ఞాన శాస్త్రవేత్తలను ప్రకృతి తన అద్భుత రహస్యాలతో ఆశ్చర్య చకితులను చేస్తూ వుంటే మరొకవంక మానవాళి ఆ ప్రకృతిని అనాసక్తికరమైనదిగా తలుస్తూ జీవితాన్ని అశాంతితో విసుగుతో ఈడుస్తూ వుంటుంది. విజ్ఞాన శాస్త్రవేత్తలు చెప్పిన వాటిని కూడ ఆసక్తితో నిజంగాతెలుసుకోజూచేవారి సంఖ్య చాల స్వల్పము. సాధ్యమైనంత తక్కువ చదివి అందులో కూడ సాధ్యమైనంత వరకు అవగాహన లేకుండా ముక్కున పెట్టుకొని పరీక్షలో కక్కేసి మరచి పోచూచె వారి సంఖ్య అధికము.

అయినప్పటికీ ప్రతివాడు తానెంతో యోచనా పరుడినని తనకెంతో తెలుసునని ప్రకృతిని గూర్చి తనకున్న అభిప్రాయాలు వాస్తవాలనీ అట్టి అభిప్రాయాలు కలిగియుండే అర్హత తనకున్నదనీ తలుస్తాడు. ఇదీ ఒక పెద్ద మూఢ నమ్మకమే. ఆ మాట విస్మరించి తన అభిప్రాయాలకు భిన్నమైన మూఢనమ్మకాలేవో ఉన్నాయనీ, తక్కిన వారందరూ వాటిలోనలిగి మగ్గిపోయేవారని తలచి

వాటిని తొలగించ యత్నిస్తారు. తక్కినవారు కూడ అలా యోచ నారహితులే కనుక, అలా వాదించడానికి నిజమైన యోచనఅవస రం లేదు కనుక అట్టివాదాలకు తలలూపి ఆమోదం తెలిపి తాము విజ్ఞులైన ఆధునికులమని ఆత్మవంచన చేసుకుంటారు.

సరిగా తెలుసుకుంటే ప్రతివస్తువుకూ మనకు తోచిన కంటే ఎన్నో అధికమయిన ధర్మాలూ, ఉపయోగాలువుంటాయి. కొబ్బరి చెట్టును తలచుకోగానే దాని కాయల వినియోగం మాత్రమేమనకు స్ఫురిస్తుంది. దాని ఆకులు, పీచు, పెంకులోని నూనె మొ॥న భాగాల ప్రయోజనాలను గూర్చి సాంకేతిక విజ్ఞానం ఏమి తెలుపు తుందో చూస్తే మనమూహించలేనన్ని ప్రయోజనాలు దానికున్నా యని మనకు బోధపడ గలదు. అట్టి సాంకేతిక నిపుణులు చెప్పిన దికూడ నిజానికి సంపూర్ణంకాదు. వైద్యుని విచారిస్తే అందులోని వివిధ భాగాలు వివిధ ప్రయోజనాలు కలిగి వున్నాయని చెపుతారు. ఈఆధునిక యుగంలో ఈరీతిన ఆలోచించ గలవారు వైజ్ఞానికులు, వెనుకటి కాలంలో ఋషులు.

ఋషిప్రోక్తములైన శాస్త్రాలలో వివిధములైన వృక్షాలకు పదార్థాలకూ అసంఖ్యాకమైన ప్రయోజనాలున్నట్లువ్రాస్తారు. ఇలాం టి వాటిల్లో తులసి ఒకటి. దీనికి వైద్యశాస్త్రంలో ఎంతో ప్రాము ఖ్యత ఉన్నది. తులసి ఆకురసానికి, తులసి విత్తనాలకూఆమొక్క యొక్క స్పర్శకూ వాసనకూ గూడ ఎంతో ప్రభావమున్నదని ఆయుర్వేదము, హోమియోపతీ శాస్త్రాలు చెపుతాయి. అంతేకాక తులసికి ఆధ్యాత్మికమైన ప్రభావమున్నదని మంత్ర గ్రంథాలవల్ల తెలియగలదు. కనుకనే ప్రతి యింట్లోనూ తులసి కోటను స్థాపిం

చడం దేశ ఆచారంగా పెద్దలు సెలకొల్పారు. తులసిమాలను ధరించడం కూడ ఎంతో శ్రేష్ఠమయినదని శాస్త్రం చెబుతుంది. తమోగుణాన్నిమనస్సు నుండిపారద్రోలి సత్వగుణాన్నివృద్ధిచేయుడమే తులసి మొక్క ముఖ్య ప్రయోజనం.

ఇటువంటి మూలికలనూ వృక్షాలనూ గూర్చిన ఆధునిక విజ్ఞానం కంటే గూడ ప్రాచీను లెంతగానో విశిష్టమైన విజ్ఞానాన్ని సాధించారనిచెప్పక తప్పదు.సృష్టియావత్తు దైవంయొక్క విశ్వరూపమని మన ప్రాచీనులు వర్ణించారు. అంటే ఒకే మూల చైతన్యం వివిధ స్థాయిలో ఇతర జీవులలో వలె వృక్షాలలోనూ మూలికలలోను కూడ ప్రకట మవుతుందని చెప్పారు. అందుకే సృష్టికర్త అనంతమైన సృష్టిజాలాన్ని సంకల్పించినపుడు అందులోని అన్ని అంశాలు పరస్పరం తోడ్పడేవిగా వుంటాయి. ఒకేపరిసరాలలో జన్మించి వృద్ధిచెందే జీవులన్ని ఆపరిసరాల కనుగుణమైనవిగా ఏర్పడతాయని నేటి జీవశాస్త్రజ్ఞులు కూడా గుర్తించారు ఆజీవులు ఆపరిసరాలను, ఆపరిసరాలు ఆజీవులనూ సరియైన స్థితిలో నిలుపుకొనే రీతిన సమకూరుతాయి. ఇట్టి సామరస్యాన్ని వివరించే విజ్ఞానమే నేటి యికాలజీ అను విజ్ఞాన శాస్త్రంగా రూపొందింది మన ప్రాచీనపదజాలంలో చెప్పాలంటే ఒకానొక మౌలికమయిన చైత్యనాన్ని పంచుకుని ఆజీవులూ ఆపరిసరాలలోని పదార్థాలూ ఉండడంవలన వాటికట్టి సామరస్యం సిద్ధిస్తుంది. తులసి వంటి ఓషధులు కూడ అట్టి చైనతన్యం కలిగి వుంటాయని మనప్రాచీనులు గుర్తించినట్లుఆధు నికులుగుంర్తిచగానేలేదు ఇటీవల ఒక బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు మొక్కలు మన భావోద్రేకాలను ఎంతో సూక్షంగా గ్రహిస్తాయని యంత్ర సహాయముతో నిరూపించారు.

మొక్కను పెంచిన యజమాని ఎంత దూరాన ఉన్నాకూడా అతని భావాలలోని మార్పులను మొక్కలు గ్రహిస్తాయని అతడు కనుగొన్నాడు. అతడు ప్రయోగాత్మకంగా ఈసత్యాన్ని నిరూపించాడుకూడ. మొక్కలోని ధాతువులలో సంభవించే సూక్ష్మమైన మార్పులను గమనించగల యంత్రానొక మొక్కకుతగిలించాడు వేరొకగదిలో ఆమొక్కను ఎవరు నాశనంచేయాలనిఅయిదుమంది శాస్త్రజ్ఞులచేత చీట్లు తీయించాడు. ఆతర్వాత వారొక్కక్కరే ఆమొక్క ప్రక్కనుండి సాగిపోయారు. దాని ధ్వంసం చేసేవంతు లభించిన శాస్త్రజ్ఞుడు ఆలా సాగిపోయినపుడు ఆ మొక్కలో తీవ్రమైన సంచలనము ఆయంత్రం వ్యక్తం చేసింది

ఈసూత్రాన్ని గుర్తించి మన ప్రాచీనులు వృక్షాలను మొక్కలను వ్యర్థంగా తుంచరాదని నిషేదించారు. అంతేకాక వాటి నుండి మన అవసరార్థం కొన్ని విభాగాలను సేకరించవలసి వచ్చినపుడు వాటికి మొదట నీరు సమర్పించి పూజా భావంతో ప్రేమతో ఆ వృక్షానికి నమస్కరించి తన ప్రయోజనాన్ని నెరవేర్చి ధాతు పుష్టిని కలిగి వుండాల్సిందని నివేదించిన తర్వాతనే ఆయావిభాగాలను సేకరించడం యుక్తమని ఋషులు నిర్దేశించారు అందుకే శాస్త్రంలో దంత ధావనానికి పుడకవిరుచుకునే దగ్గరనుండే ఆయా సమయాలలో పఠించవలసిన శ్లోకాలలో ఇట్టి భావాన్నే ప్రకటించారు తులసి భౌతికమైన ప్రయోజనాలు మాత్రమే కాక అధ్యాత్మికమైన ప్రయోజనం కూడా ఎంతగానో కలిగి వుండటంవలన దానిపట్ల పూజ్యభావాన్ని భక్తులు వహించడం సముచితమే. అట్టి భావాన్ని ప్రకటించే ప్రక్రియే అర్చన, లేక పూజ. ఈ పూజలో

తులసియొక్క ప్రభావాన్ని కీర్తించే శ్లోకాలు పురాణాది వివిధ గ్రంథాలలో కన్పిస్తాయి. అలా స్తుతించడంలో ఒక నిగూఢమైన ప్రయోజనమున్నది. కవియొక్క, కళాకారునియొక్క నైపుణ్యాన్ని అర్థంచేసుకొని అభినందించగల వ్యక్తి లభించినపుడు ఆకవి హృదయములో భావపారవశ్యము కవితా చమత్కృతీ పరవళ్ళు తొక్కుతాయి. అలా ఆదరించలేని రసవిహీనులు తారసపడినపుడు కవిలోని రసజ్ఞత సంకుచితమై పోతుంది. మనప్రేమను చూరగొన్న వ్యక్తి మననాశ్రయించినపుడు అతనితో సహకరించడంలో మనం బాధకు గురికావలసివచ్చినా ప్రేమ కారణంగా అది యిట్టి బాధే అవుతుంది. అలానే తులసియొక్కనుండి చక్కని ప్రయోజనాలను పొందదలచిన వ్యక్తి ఎంతగా ఆ ఓషధియొక్క ప్రభావాన్ని శ్రద్ధాపూరకంగా, ప్రేమ పూరకంగా స్మరిస్తాడో అంతగా అందులో ప్రభావం మేలుకుంటుంది. అతడిపూజ్యభావమూ ప్రేమ, ఎంత సహజమో బలవత్తరమో అంతమేరకు నిశితమైన చైతన్యంగల ఆ ఓషధికి కూడా అంత ప్రేమభావం కలగడం వలన అతడందులోని విభాగాలను కోస్తున్నందువల్ల కలిగే బాధ అంత తక్కువగా వుంటుంది. దాని ప్రభావము ఎక్కువగాను వుంటుంది.

అంతేకాదు ఒక వస్తువు, లేక ఒక వ్యక్తియొక్క విలువనూ గుణాన్ని మనమెంతగా గుర్తిస్తామో, దానిపైనెంతగా మనకు మన ఎరుకను నిలుపుతామో అంతమేరకు దానివలన మనకు లభించిన ప్రయోజనం కూడా అధికంగా వుంటుంది. తుదకు ఎంత

పేదవాడైన ఒక వ్యక్తి ఎంతో ప్రేమతో వచ్చిన అతిధునకు అతి సామాన్యమైన ఆతిధ్యమే యిచ్చారనుకుంటాడు. ఆ ప్రేమను గుర్తించగల వాడికి వడ్డించిన పదార్థం కంటే దానిద్వారా ప్రకటమయ్యే అతని ప్రేమ ఎక్కువ మధురంగా వుంటుంది. అది తెలియని మొరటు వానికి వడ్డించిన పదార్థంయొక్క న్యూనత మాత్రమే అనుభవమవుతుంది. అలానే ఓషధి యొక్క ప్రభావాన్ని గుర్తించుకొని కృతజ్ఞతా భావంతో సేవించునవుడు దాని ప్రభావమెక్కువగావుంటుంది. ఈవిషయాన్నే మనశాస్త్రాలు, "వైద్యుడూ, ఓషధి, మంత్రమూ, గురువుల యందుగల శ్రద్ధ ననుసరించివివిధ వ్యక్తులుతరతమ భేదాలతో ప్రయోజనాన్ని పొందుతారనిచెప్తాయి.

ఇందుకింకొక కారణం కూడ వున్నది. విశ్వాసానికి మానవుడి మనసుపైన, దేహంపైన మనమూహించని కంటే ఎంతో అధికమైన ప్రాబల్యం వుంటుంది. వివిధ ప్రాక్పశ్చిమ దేశాలలో ఎట్టి మందులూ వుపయోగించకుండానే దైవంపైనగల విశ్వాసాన్నాధారంగా చేసికొని అనివార్యములైన రోగాలను తగ్గించ గలగడం నేటి శాస్త్రజ్ఞులను సహితము ముగ్ధులను చేస్తుంది. ఇన్ని ప్రకృతి సూత్రాలు తులసి నారాధించడం, సేవించడంలో పూర్వ ఋషులు పొందు పరచారు. అయితే ఈవిషయాలు ఎన్నో గ్రంధాలలో చెదురు మదురుగా వుండడము వలన సామాన్యులకు లభ్యం కావడంలేదు. ఆకారణంగా తులసి పట్లగల భక్తి గౌరవాలను ప్రాచీన మూఢనమ్మకాల క్రింద లెక్క కడుతున్నారు నేటి మూఢ 'విజ్ఞానవేత్తలు'. వివిధ శాస్త్రాలలోను గ్రంధాలలోను దాగియున్న ఇట్టిరహస్యాలను ఒక గ్రంధంగా పొందుపరచి మనకందించడ

ములో రచయిత మన సనాతన ధర్మానికే గాక మానవజాతికే ఎంతో చక్కటి ప్రయోజనాన్ని నెరవేర్చారు. కనుక ఈగ్రంథం తులసి మొక్క వలెనే చదువరులలో పెరటిలో పెన్నిధి అనడం అతిశయోక్తి కాదు. ఇందులోని వివిధ అధ్యాయాలను పరిశీలించి నపుడు వాటిలోని విషయాలకు గల పరస్పర సంబంధము సుస్పష్టము కాగలదు. ఈ గ్రంథం చదివిన తర్వాత పెరటిలో తులసి మొక్కను నాటుకొని శ్రమపడకనే ఇందు చెప్పబడిన ప్రయోజనాలను పొందలేనివాడు అవి వేకియే అని చెప్పాలి. కష్టించి ఆర్జించిన ధనాన్ని మందుల దుకాణాలలో గుప్పిస్తూ, అంతటి ప్రయోజనాన్ని చేకూర్చగల పెరటిలోని అప్పుని పిలుపుని వినలేని వాణ్ణి దౌర్భాగ్యుడనే చెప్పాలి.

(పం) భరద్వాజ

ద్వారకామాయి

విద్యానగర్

విద్యానగర్

3-12-81



# యథార్థవాక్యం

అరవై ఏళ్ళు పైబడ్డాక పోయేచూపు తప్ప భాగుపడే చూపు ఉండదనేమాట యథార్థం. అలాగే ఈకలియుగాన రోజులు గడచినకొద్దీ విశ్వాసము, ధర్మము క్షీణించే రోజులేతప్ప నిలబడడం కష్టమే. అలా చూపుపోయినా స్పృతులతో తడిపి అయినా వస్తువు నెఱిఁగి ఉపయోగించుకొను ముదుసలులవలె అలౌకికమగు విశిష్టతలు తెలిసికొని అంగీకరించ లేకపోయినా సులభంగా తెలిసే ప్రయోజనాల నర్థం చేసికొని అయినా సద్వినియోగం చేసుకొంటారనే ఉద్దేశ్యంతో ముందుగా తులసి ప్రయోజనాలనివ్వటం జరిగింది. దానివలనకాక విశిష్టతనే గ్రహింపగల్గి ఆరాధించు మహనీయులకు వందనము. వారుకూడ ప్రయోజనము లెఱుఁగుట అవసరమేయని యూహ.

ప్రత్యక్ష ప్రమాణమునే విశ్వసించువారు ఈచిన్న మొక్కను దేవతగా కొలుచుటగూర్చి ముక్కుపై వేలిడు కొందరు గాక! వారికి అన్యప్రమాణములయెడ విశ్వాసము శూన్యమగుట చే చెప్పి ప్రయోజనములేదు. కాని వారి ఎదుట వారిఫోటోపై ఉమిసిన వారిపై ఉమ్మి వైచినట్లు భావించువారికీవిషయం అర్థం కాకపోదు. మనముందుండునది మొక్కయే అయినా మన మర్చించునది తదధిదేవతనే. దేవాలయమందు దేవుని పూజించు చుంటిమే కాని శిల్పమును కాదుకదా! ఇట్టి ఆధిదైవికజ్ఞానము లేకనే చంద్రమండలము చేరిన రోదసీయాత్రికులగూర్చి వారు చంద్రునిపైకాలు పెట్టినారని, చంద్రుడేమీ చేయలేదని యనుచున్నారు. వారు చంద్రమండలముపై కాలుపెట్టిరేకాని తదధి దేవత

యగు చంద్రునిపై కాదను విషయమావిమర్శకులకు తెలియదు భూదేవి అధిదేవతగా కల భూమిపై మనం నివసిస్తూనేఉన్నాము కదా!

స్వాభిమానం కోల్పోయి ముంజేతి కంకణమును చూచు కొనుటకు అద్దమును కోరే నేటిసమాజం మన పూర్వులగు మహా మహులు, శాస్త్రములు ఎంతగా చెప్పినా విశ్వసించలేదు.కాని దానిపై పాశ్చాత్యుల నిరక్షరాస్యుని వ్రేలిముద్ర పడినా విశ్వ సించే స్థితిలో ఉంది. అట్టి వారికై కూడ కొన్ని యంశము లీయక తప్పదు.

పాశ్చాత్యులుకూడ తులసి విశిష్టతను వేనోళ్ళపొగిడారు. తులసి జలంతో తడిసిన శవం కుళ్ళిపోక కొంతకాలం నిల్వ యుండునని అమెరికన్ శాస్త్రజ్ఞులు పరిశోధించి కనుక్కొన్నారు. అమెరికాలో ఒకప్పుడు కొందఱు సైంటిస్టులు టాక్సీలో పోతూ వుంటే సమీపములోని పొదలలో ఒక శవం కన్పడింది. దానికి బాక్టీరియాక్రిములు వ్యాపించలేదు. ఆశ్చర్యంతో ఆశవాన్ని పరిశీ లిస్తే అది అప్పటికి వారం క్రిందట చనిపోయిందని చెప్పటంతో కారణమాలోచించి ఆపొద అంతా ఒకేజాతి చెట్లతో ఉండటంతో ఆచెట్టుపై పరిశోధనలుజరిపారు. దాన్ని మనదేశంకూడపంపి దీనినే మంటారని అడిగితే మనవారు తులసి అంటామన్నారు. బాక్టీరియా క్రిములను వ్యాపింపనీయని ఆమొక్క అన్ని రోగాలనుండి రక్షి స్తుందని, ప్రతియింట దానిని నాటించడం మంచిదని ఆనాటికి వారు గుర్తించారట. మనకది అనాది ఆచారమే.

# యధార్థవాక్యం

అరవై ఏళ్ళు పైబడ్డాక పోయేచూపు తప్ప బాగుపడే చూపు ఉండదనేమాట యథార్థం. అలాగే ఈకలియుగాన రోజులు గడచినకొద్ది విశ్వాసము, ధర్మము క్షీణించే రోజులేతప్ప నిలబడడం కష్టమే. అలా చూపుపోయినా చేతులతో తడిపి అయినా వస్తువు నెఱిఁగి ఉపయోగించుకొను ముదుసలులవలె అలౌకికమగు విశిష్టతలు తెలిసికొని అంగీకరించ లేకపోయినా సులభంగా తెలిసే ప్రయోజనాల నర్థం చేసికొని అయినా సద్వినియోగం చేసుకొంటారనే ఉద్దేశ్యంతో ముందుగా తులసి ప్రయోజనాలనివ్వటం జరిగింది. దానివలనకాక విశిష్టతనే గ్రహింపగల్గి ఆరాధించు మహనీయులకు వందనము. వారుకూడ ప్రయోజనము లెఱుఁగుట అవసరమేయని యూహ.

ప్రత్యక్ష ప్రమాణమునే విశ్వసించువారు ఈచిన్న మొక్కను దేవతగా కొలుచుటగూర్చి ముక్కుపై వేలిడు కొందరు గాక! వారికి అన్యప్రమాణములయెడ విశ్వాసము శూన్యమగుట చే చెప్పి ప్రయోజనములేదు. కాని వారి ఎదుట వారిఫోటోపై ఉమిసిన వారిపై ఉమ్మివైచినట్లు భావించువారికీవిషయం అర్థం కాకపోదు. మనముందుండునది మొక్కయే అయినా మన మర్చించునది తదధిదేవతనే. దేవాలయమందు దేవుని పూజించుచుంటిమే కాని శిల్పమును కాదుకదా! ఇట్టి ఆధిదైవికజ్ఞానము లేకనే చంద్రమండలము చేరిన రోదసీయాత్రికులగూర్చి వారు చంద్రునిపైకాలు పెట్టినారని, చంద్రుడేమీ చేయలేదని యనుచున్నారు. వారు చంద్రమండలముపై కాలుపెట్టిరేకాని తదధి దేవత

యగు చంద్రునిపై కాదను విషయమావిమర్శకులకు తెలియదు భూదేవి అధిదేవతగా కల భూమిపై మనం నివసిస్తూనేఉన్నాము కదా!

స్వాభిమానం కోల్పోయి ముంజేతి కంకణమును చూచుకొనుటకు అద్దమును కోరే నేటిసమాజం మన పూర్వులగు మహాముహులు, శాస్త్రములు ఎంతగా చెప్పినా విశ్వసించలేదు.కాని దానిపై పాశ్చాత్యుల నిరక్షరాస్యుని వ్రేలిముద్ర పడినా విశ్వసించే స్థితిలో ఉంది. అట్టి వారికై కూడ కొన్ని యంశము లీయక తప్పదు.

పాశ్చాత్యులుకూడ తులసి విశిష్టతను వేనోళ్ళపొగిడారు. తులసి జలంతో తడిసిన శవం కుళ్ళిపోక కొంతకాలం నిల్వయుండునని అమెరికన్ శాస్త్రజ్ఞులు పరిశోధించి కనుక్కొన్నారు. అమెరికాలో ఒకప్పుడు కొందఱు సైంటిస్టులు టాక్సీలో పోతూవుంటే సమీపములోని పొదలలో ఒక శవం కన్పడింది. దానికి బాక్టీరియాక్రిములు వ్యాపించలేదు. ఆశ్చర్యంతో ఆశవాన్ని పరిశీలిస్తే అది అప్పటికి వారం క్రిందట చనిపోయిందని చెప్పటంతో కారణమాలోచించి ఆపొద అంతా ఒకేజాతి చెట్లతో ఉండటంతో ఆచెట్టుపై పరిశోధనలుజరిపారు. దాన్ని మనదేశంకూడపంపి దీనినేమంటారని అడిగితే మనవారు తులసి అంటామన్నారు. బాక్టీరియాక్రిములను వ్యాపింపనీయని ఆమొక్క అన్ని రోగాలనుండి రక్షిస్తుందని, ప్రతియింట దానిని నాటించడం మంచిదని ఆనాటికి వారు గుర్తించారట. మనకది అనాది ఆచారమే.

# తులసి విశిష్టత

శ్రీతులసి పేరునందే అందుగల విశిష్టత తెలియును తుల అనగా సాటి. సాటిలేనిది, అమూల్యమైనది యను నర్థమున తులసి శబ్దమును చెప్పుచున్నారు. ఆవిషయము తులసి ప్రార్థన వలననే తెలియుగలదు.

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని- యన్మధ్యేసర్వదేవతాః
యదగ్రే సర్వవేదాశ్చ- తులసీం త్వాం నమా మ్యహమ్॥

అనగా తులసి చెట్టు మూల భాగమున సర్వతీర్థము లుండును, మధ్యభాగమున సర్వదేవతలుందురు, చివరి భాగమున వేదములన్నియు నుండును, కావున ఓతులసీ నీకు నమస్కరించు చున్నాను. అను ఈభావమును బట్టి దేవలోకమున కల్పవృక్షమని చెప్పునట్టిదే భూలోకమున ఈ తులసి యనిపించుచున్నది. కావు ననే తులసియుండని ఇల్లు సంప్రదాయ పరిధిలోలేదు.

శ్లో॥ తులసీ కాననం యత్ర - యత్ర పద్మవనాని చ
సాలగ్రామ శిలా తత్ర - యత్ర సన్నిహితో హరిః॥

తులసీవన మెచ్చటుండునో, పద్మవన మెచ్చట నుండునో సాలగ్రామ మెచ్చటుండునో అచ్చట విష్ణువుండునమట దానిగా ప్పతనమునకు నిదర్శనము. ఇంకను అగస్త్య సంహితయం దీరీతిగా చెప్పబడినది.

శ్లో॥ తుల స్యారోపితా సిక్తా - దృష్టా స్పృష్టా చ పాలితా
ఆరోపితా ప్రయత్నేన - చతుర్వర్గ ఫలప్రదా॥

తులసిని నాటినను, నీటితో తడిపినను, చూచినను, తాకినను, పోషించినను, భక్తితో వనమేర్పర్చినను ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలములు నొసంగును.

శ్లో॥ తులసీ విపినస్యాపి - సమంతా త్పావనస్థలం
యోజన త్రితయం జ్ఞేయం - గాంగేయస్యేవ సాధకః॥

తులసివన ప్రదేశము, పరిసరములు సైతము పవిత్రమైనవే. తులసి వనమునకు మూడామడల దూరమువఱకు గంగాతీర మెంతటి పవిత్రమో అంతటిపవిత్రము.

శ్లో॥ తులసీ కాననం చైవ - గృహేషు స్యావతిష్ఠతే॥

తులసీవన మెవరియింట నుండునో ఆఇల్లు పుణ్యతీర్థంతో సమానము. అచ్చటకు యమకింకరులు రారు. అనగా నచ్చట మరణభయము వంటి వుండవనుట. కావున అనాదిగా ప్రతియింటను తులసి సమారాధింప బడుచున్నది. తులసిలక్ష్మీస్వరూపిణి. లక్ష్మి యెచ్చటనుండునో విష్ణువచ్చట సన్నిహితుడై యుండును. కావున తులసి యున్న తావుహరిసన్నిధియే. అందు సనే బ్రహ్మాండ పురాణమునందు

శ్లో॥ అనన్యదర్శనాః ప్రాతః - యే పశ్యంతి తపోధన
జగత్త్రితయ తీర్థాని - తై ర్దృష్టాని న సంశయః॥

అని చెప్పబడినది. పొద్దుననే నిద్దురలేచి ఇతరములు చూడకుండా తులసిని చూచినచో ముల్లోకములందలి తీర్థస్థలము

ఐను దర్శించిన పుణ్యఫలము లభించును. కావున తులసిని దర్శిం చుట లక్ష్మీనారాయణులను దర్శించుట వంటిది. తులసిదళములు దైవారాధనము నందు శ్రేష్ఠములు. వానివలన సర్వదేవతలుతృప్తి నందుదురు. విశేషించి విష్ణువునకు వానిపూజ మిక్కిలి ఇష్టము. విష్ణుచిత్తుడను విష్ణుభక్తుడు తులసివనముపెంచుట, శ్రీరంగనాథుని తులసి మాలలతో సేవించుట పూరాణప్రసిద్ధము. ఆవిష్ణుచిత్తు నను గ్రహించిన కారణమున లక్ష్మీ స్వరూపిణియగు గోదాదేవితుల సీవనముననే లభించినట్లు తెలియుచున్నది. విష్ణువునకు తులసి యందుగల ఇష్ట మింతింతనలేము. కృష్ణావతారమున తులాభార మున తూగు కన్నడెంత బంగారమును, ఎంతటి సంపదయు తనతోతూగలేవని భక్తితోనొసగు తులసి తనతో తూగగలదని నిరూపించిన గాథ శిరోధార్యము. అంతటి విశిష్టతగలది తులసిదళము.

తులసియొక్క ఎండు మొక్కలతో పూసలన్నుచేసి వానిని వినియో గించుటయు దైవమునకు ప్రీతికరము. అట్టి పూసల మాలలను ధరించుట, జపమాలికను వినియోగించుటయు విష్ణుభక్తుల విషయమున ప్రశస్తము.

శ్లో॥ యః కుర్యా త్తులసీకాష్ఠే - అక్షమాలాం సురూపిణీం
కంఠమాలాం చ యత్నేన - కృతం తస్యా క్షయం భవేత్॥

ఎవడు తులసి కఱ్ఱతో చక్కని పూసలుచేసి మాలగా కంఠ మున ధరింతురో లేదా జపమాలగా నొనర్తురో వారికన్ని కర్మ

లందు అక్షయ మగునని పై శ్లోకము చెప్పుచున్నది అట్టి తు
చెక్కతోగంధముదీసి దైవమునకుపచారమొనర్చుటయు శ్రేష్ఠపే

శ్లో॥ సంఘృష్ఠ తులసీకాష్ఠం - యో దద్యా ద్రామమూర్ధ
కర్పూరాగరు కస్తూరీ - చందనం చ న తత్సమ॥

తులసి చెక్కతో గంధముతీసి రామునకు పూసినచో
కర్పూరము, అగురు, కస్తూరి, చందనము మున్నగునవేవియు
దానితో సమము కావు. ఇట్లే తులసీ దళముల విషయమునకూ

శ్లో॥ తులసీమంజరీభిర్యః - కుర్యాద్ధరిహరార్చనం
నస గర్భగృహం యాతి - ముక్తిభాగీ భవేన్నరః॥

తులసీ దళములతో విష్ణువునుగాని, శివునిగానియర్చిం
చువాడు మరల జన్మమనునది లేక ముక్తి నందును. అను పైశ్లో
కము ప్రమాణముగనున్నది. ఇంక హరిహర స్వరూపుడగు హను
మంతుని పూజయందు తులసీదళములు ముఖ్యములని హనుమ
త్పూజా ద్రవ్యములందే అనేకచోట్ల కానవచ్చుచున్నది. ఇంత
చెప్పనేల తులసీదళము సర్వదేవతలకు పూజాద్రవ్యమే

శ్లో॥ యే స్మరంతి సకృ ద్దేవీం - తులసీం విష్ణు వల్లభాం
అహోరాత్రకృతం పాపం - తత్క్షణాదేవ నశ్యతి॥

ఎప్పుడో ఒక్క మారైనఎవరు విష్ణుపత్నియగుతులసినిస్మరింతురో
అట్టివారొనర్చిన అహోరాత్రుల పాపములుఅక్షణమున నశించును.

శ్లో॥ తులస్యాశ్చైవ మాహాత్మ్యం - నేష్టి వక్తుం హి విశ్వసృత్
భవభంజన మేత త్తే - సర్వాభీష్టం ప్రయచ్ఛతి
నాతః పరతరం కించి - త్పావనం భువి విద్యతే॥

తులసి మాహాత్మ్యమును బ్రహ్మ కూడ చెప్పలేడు. ఆమాహాత్మ్యము పాపముల తొలగించి సర్వాభీష్టముల నొసంగునది తులసికిమించిన పవిత్రమైనది భూమియందొక్కటియులేదు అని తులసిమాహాత్మ్యము కొనియాడ బడుచున్నది. తులసి పరమ పతి వ్రత. తులసి చెట్టును నిదురలేచినవెంటనే చూచునట్లు ప్రాతఃస్మర ణమున గూడ కలదు. ఆరోగ్యప్రద, మంగళప్రదయగు తులసి స్త్రీలందరి కారాధ్యయగుట యేకాదు.

శ్లో॥ చతుర్ణా మపి వర్ణానా - మాశ్రమాణాం విశేషతః
స్త్రీణాం చ పురుషాణాం చ - పూజి తేష్టం దదాతి హి॥
బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర చాతుర్వర్ణ్యమునకు,

బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్యాసులను నాల్గు ఆశ్రమము లవారికి, స్త్రీలకు పురుషులకు పూజింపదగినదై కోర్కెలదీర్చును. అని అందరకు పూజనీయముగా చెప్పబడినది.

శ్లో॥ యద్ధర్మకర్మ కురుతే మనుజః పృథివ్యాం
నారాయణ ప్రియతమాం తులసీం వినాచ
తత్సర్వ్య మేవ విఫలం భవతి ........

అను శ్లోకమువలన ఏధర్మ కార్యమైనను తులసినారా

ఠింపకున్న విఫలమగునని తెలియుచున్నది. కావున అట్టి తులసి పూజా విధానము ప్రతి దిన మాచరింపదగినదే. కార్తీక శుద్ధ ద్వాదశి క్షీరాబ్ధి ద్వాదశి. ఆనాడు తులసిపూజ శ్రేష్ఠము. అనుదినం 'యన్మూలే' అను మొట్టమొదటి శ్లోకమును చదువుచు తులసి చెట్టుకు నీరుపోయుట, నమస్కారముచేయుటయైన ప్రతివారికి కర్తవ్యము. పూజకుగాని, ఔషధములకుగాని తులసిదళముల విలువ ఇంతింతని చెప్పలేము. అట్టిదళములను స్త్రీలు కోయరాదని చెప్పుదురు. పురుషులైనను నీరు పోయువారే నైతికముగ నర్హులు. పురుషులు కోయునప్పుడైన ఈ క్రింది శ్లోకమును పఠించుచు ప్రదక్షిణ నమస్కారములు చేసి కోయవలెను.

శ్లో॥ తులస్యమృతజన్మాసి - సదాత్వం కేశవప్రియే !
కేశవార్థం లునామిత్వాం - వరదాభవ శోభనే॥

శ్లో॥ మోక్షైక హేతో ర్ధరణిప్రసూతే:
విష్ణో స్సమస్తస్య గురోః ప్రియే తే
ఆరాధ నార్థం పురుషోత్తమస్య
లునామి పత్రం తులసి! క్షమస్వ॥

శ్లో॥ ప్రసీద మమ దేవేశి! ప్రసీద హరివల్లభే!
క్షీరోద మథనోద్భూతే!-తులసి! త్వం ప్రసీద మే॥

ఓ తులసీ! నీవు అమృత జన్మవు విష్ణు పత్ని! హరిపూజకై నిన్ను కోయుచున్నాను. నన్ననుగ్రహింపుము. మోక్షమిడుటకై భూమిపై అవతరించినదానా! విష్ణ్వారాధనకై దళములు కోయుచున్నాను. క్షమింపుము. ఓ విష్ణుపత్ని! సముద్ర

ధనమున పుట్టినదానా! నన్ననుగ్రహింపుము. అనిప్రార్థించవ నుతులసీ ప్రదక్షిణనమస్కార ఫలము నిట్లు చెప్పుచున్నారు.

శ్లో॥ ప్రక్షిదణం భ్రమిత్వా యే -నమ స్కుర్వంతి నిత్యశః
సప్తద్వీపవతీం పృథ్వీం - స రత్నాకర మేఖలామ్॥
దత్త్వాయత్తత్ఫలం నిత్యం - ప్రాప్నువంతి న సంశయః
అశుభాని వినశ్యంతి - దురితా న్యపి దూరతః॥

తులసికి నిత్యము ప్రదక్షిణ మొనర్చి నమస్కరించుట వలన సప్తద్వీపములు, సముద్రమేఖల కల భూమిని నిత్యము దానము చేసిన ఫలము లభించును. అశుభములు తొలగి పాపము నుండి ముక్తుడగును. తులసియొక్క భౌతిక ప్రయోజనము లనేకములు కానవచ్చుచున్నవి. అవి ఐహికములు పారమార్థిక మునకు తులసి ముఖ్యమనుటకు అవసాన క్షణమున మనుజునకు తులసి తీర్థము పోయుటయే నిదర్శనము. ఇంకను ప్రమాణ ము క్రిందివ్రాయకము

ప॥ తులసీ సన్నిధౌ ప్రాణాన్ - యే త్యజంతి మునీశ్వర!
న తేషాం నిరయ క్లేశః - ప్రయాంతి పరమం పదమ్ ॥

తులసి సమక్షమున ఎవరు ప్రాణములు విడుతురో వారికి నరక బాధయుండదు. వారు మోక్షమునందుదురు.

# తులసి ప్రయోజనము

సుమారు రెండుమూడడుగుల మాత్రపు ఎత్తుగల తులసి మొక్క ప్రయోజనం దృష్ట్యా ఇంతింతనరానిది. ఇది రంగును బట్టి శ్వేత, కృష్ణ భేదాలతో రెండు రకాలుగా ఉంటుంది. వీనినే లక్ష్మి తులసి, కృష్ణ తులసి అంటారు. గుణములలో మాత్రం కృష్ణ తులసియే శ్రేష్ఠం. కృష్ణతులసి ఏకాకిగా ఉండవచ్చు కాని లక్ష్మి తులసిని ఒక్కదానినిగా ఉంచరాదని అంటారు. సుగుణ ధర్మాలు కృష్ణ తులసియందు ముఖ్యముగా ఉండటం వల్లనే ఆనియమమై ఉండవచ్చునని స్థూలంగా ఆలోచించవచ్చు. కృష్ణ తులసి కాస్త నల్లగా ఉండటమే వీటి రెంటిలోముఖ్యముగా తేడా. ఇవి శీతాకాలంలో సహజంగా పూతకువస్తాయి.

మలేరియా వ్యాధిని తొలగించుటలో తులసికి గొప్పశక్తి ఉంది. ప్రపంచంలో ముఖ్యంగా మనదేశంలో మలేరియాను నిర్మూలించవలెనని చేయు కృషి ఎంతగానో కానవచ్చు చున్నది. వేయిరూపాయల బహుమతులు ప్రకటించి ప్రచారములు సాగించుచున్నారు. అంతకంటే ప్రతియింట తులసిని పెంచవలెనని శాసించి ప్రచారము చేయుట సర్వదా శ్రేయస్కరమనుట నిస్సందేహము. అది సులభ సాధ్యము, ఆర్థిక సముచితము కూడ. తులసి వనమునకు మూడు యోజనములవఱకు పవిత్రమనుట దాని వాయువు వ్యాపించినంతవఱకు దానిశక్తి పనిచేయుననుటకే. అందుకే అనాదిగా ప్రతియింట తులసి ఆరాధ్యదైవమను నెపమున పోషింప బడుచున్నది. దానినుండి వచ్చిన వాయువు, దాని గుణములు సోకిన జలము మంచి ఆరోగ్యము

అజీర్ణదోషం పోగొట్టగలదు. తులసి ఆకురసంతోపాటు జిల్లేడు వావిలి, గుంటకలగర మునగ, ఆముదము, కాకర ఆకులరస మును మంచి నూనెలో కలిపి వేసిన చెవుడు మానును. చాలా మందిలో సామాన్యంగా కానవచ్చేదోషం నోటి దుర్వాసన. కేవలం దీనిదళములు తినుటవలన ఆ నోటిదుర్వాసన తొలగిపోతుంది. దీనిచూర్ణము మజ్జిగతో వాడుట వలన కాన్సరు వ్యాధికి కూడా ఉపకరిస్తుంది. దీనివాయువు సోకుటవలన స్త్రీల వ్యాధుల నేకం పరిష్కరింపబడతాయి. అందుకే ప్రదక్షిణముల ద్వారా ఆ వాయువు వారిచ్చే గ్రహింపబడుతుంది. కిరణజన్య సంయోగ క్రియాకాలమున చెట్టు ఆక్సిజనునువిడుచునని శ్వాసక్రియయందు కార్బన్‌డయాక్సైడు విడచునని విజ్ఞానశాస్త్రము చెప్పుచున్నది. ఈరహస్యమునే పరోక్షముగా తెల్పుచు రాత్రి సమయములందు తులసి చెట్టును తాకుట పాపకారణంగా నిషేధింపబడింది.

తులసి అణువణువునా అనేక రీతుల ఔషధముగా ఉప కరిస్తూ మనుష్యుని రక్షిస్తోంది. తులసీదళములతో మిరియా లను బాగామర్దించి నీటితో పుచ్చుకొన్నచో ఎట్టి పురాణ చలి జ్వర మైనా తగ్గుతుంది. తులసి ఆకు సహాయంతో పాలు, పంచ దార కలిపి త్రాగిన జలుబు, దగ్గు తగ్గిపోతాయి. తేనెతో తులసి రసం తీసుకొన్నా కఫపు దగ్గులు, కోరింతదగ్గులు తగ్గగలవు. తులసి రసంలో నిమ్మకాయ రసం కలిపి రాస్తే శోభి, తామర, గజ్జి వంటి చర్మరోగాలు తగ్గుతాయి. తులసి వేరు గంధంలో వెన్నకలిపి పాముకాటువద్ద రాసి ఆ మందే తినిపిస్తే పామువిషం హరిస్తుంది

తులసి ఆకురసం ఒకటి రెండు చుక్కలు చెవిలో వేస్తే కర్ణశూలలు తొలగుతాయి. తులసి వేరు గంధాన్ని తేలుకుట్టినచోట రాసి గుడ్డ పొగచూపిస్తే బాధపోతుంది.

తులసి ఆకులలో గిరిశె్రవేళ్ళు, కరక్కాయపెచ్చులు సైంధవలవణం, మిరపగింజలు కలిపి మజ్జిగతో నూరి మూడు సార్లు లేపనంచేస్తే బద్ధమూలమునందు పుట్టే దురద పోతుంది. తులసి ఆకురసం తీసి తేనెలో కలిపి చిన్నపిల్లలకు మూడు నాలు గేళ్ళలోపు వారికిస్తే బాగా జీర్ణశక్తి కల్గి ఆకలిపుడుతుంది. తులసి ఆకు రసంతో శొంఠిపొడి చేసి కలిపి పిల్లలకిస్తే కడుపు నొప్పి వెంటనే తగ్గుతుంది. తులసి ఆకులు నలిపి వాసన చూడ టంవల్ల కొన్ని రకాల వికారాలు తొలగుతాయి తులసి ఆకురసం కళ్ళలో ఒక్క చుక్క వేస్తే కంటి వెంట నీరుకారడం పో తుంది. తులసిఆకు కషాయం, జాజికాయ చూర్ణం కలిపి పిల్ల లకు రోజుకు రెండుసార్లిస్తే విరోచనములు కట్టగలవు. తులసి వేరు కషాయం కాచి పిల్లలచేత రాత్రిపరుండ బోవునపుడు త్రాగిస్తే మలబద్ధకం హరించి ఉదయం లేవగానే సుఖవిరో చనం కాగలదు. ఉదయం లేవగానే తులసిఆకులు నమలి పండ్ల తోముకొన్నచో పండ్లు నొప్పులు తగ్గుతాయి.

స్త్రీలకు తులసిపూజ, తులసి స్పర్శన దర్శనాది క ములు ముఖ్యంగా విధించటం బట్టే వారి ఆరోగ్యంపై దీని ప్రభావమెంతో ఉన్నట్లు తెలియగలము. ప్రసవవేదనము, సూతికాశూలలను పోగొట్టటంలో తులస్యాసవము మిక్కిలి ప్రసిద్ధ

మైనది. వ్రతాదు లెక్కువ పుణ్యవతులకే ఉంటాయి. కాని తులసి పూజ స్త్రీ జాతికంతకి చెప్పడంలో వారిఆరోగ్యంపై దాని ప్రభావమే కారణము. తులసీ తైల ప్రక్రియకూడ ఉంది. అది తలకు దేహమునకు మంచిదదిగా వైద్య విదులందరుచెప్పుచున్నారు. తులసి నుండి వచ్చిన వాయువు ఎంతయో ఆరోగ్యప్రదము కావున అట్టివాయు వుసోకుటకే ప్రదక్షిణములు విధింపబడినవి. తులసిమూలమున నీరుపోసి ఆనీటిని శరీరమున చల్లుకొనుట, తీర్థమున ఎక్కువసేపు తులసీదళములుంచి పుచ్చుకొనుట లకు కారణము పై ప్రయోజనములు సిద్ధించుటే. ఆవిధముగనే తులసి నాలింగనము చెసికొనుటయు నుండును.

తులసికి ల ,రూక్ష కటు, ఉష్ణవీర్య,గుణాలున్నాయి. తులసి రసం పిల్లల కఫవికారాల పోగొట్టటంలో శ్రేష్ఠమైనది. శ్వాసకు కఫం అడ్డుపడడం మరణ సమయములందు సామాన్యంగాజరిగేపని. అవసానదశయందు తులసిజలమును పోయుటకిదియు ఒకకారణముకావచ్చును. దీని ఎండు ఆకుల చూర్ణం పీనస, కఫ,నిస్సారవ్యాధుల కుపయోగిస్తుంది. దీనిని జీర్ణవ్రణ శోధ, పీడలందులేపనం చేస్తారు. అగ్ని మాంద్యము, ఛర్ది, హిక్క ఉదరశూల, కృమి, హృద్దౌర్బల్య, రక్తవికార, కాస,శ్వాస, పార్శ్వ శూలలందిది మహోపకారి. ఇన్నిరకముల వైద్యము లందు పకరించు తులసి అమృత సమ మనుటలో సందేహము లేదు. కఫ వాతశమనకారియగు దీనికి పిత్త వర్ధక గుణముంది. దీపన, పాచన, అనులోమ, ప్రవృత్తులు కల్గి హృదయోత్తేజకము, రక్తశోధకమునై యున్నది. సామాన్య జ్వరమును

పోగొట్టుచున్నది. నల్లతులసి ఆకురసంతో అల్లపురసం కలిపి పిల్లలకిచ్చిన కడుపుబ్బు పోతుంది.

తులసికి స్వేదజనన గుణము, కృమిఘ్న గుణములు కూడా ఉన్నవి. దీని లేత ఆకురసమును ఉదయమున సేవిస్తే అజీర్ణ దోషమును పోగొట్టగల్గటం సర్వజన విదితమైన విషయమే

స్త్రీలకెట్టి ప్రత్యేక ఆరోగ్య కారణమో పురుషులకును అంతటి ప్రయోజనకారి అగుటయే కాక నపుంసకులక్కు సైతము తులసి ఆరోగ్యప్రదమగుట విశేషము. ఇది వాజీకరణము అనగా పుంస్త్వమును హెచ్చించునది. నపుంసకత్త్వము తొలగుటక్కు ఉదయ కాలమున తులసి బీజములతో ప్రయోగము ప్రశస్తమైనది. తులసి బీజముల చూర్ణముతో సమముగా పాత బెల్లము కల్పి ఉదయము, సాయంత్రము పాలతో పుచ్చుకొనిన వీర్యవికారములు తొలగును. తులసి మూలమునుచూర్ణము చేసి నీటిలో కల్పి త్రాగిన స్వప్నదోషములు తొలగుతాయి. దీని మూలానికి స్తంభన గుణము, వీర్య వృద్ధిగుణము ఉంది. తాంబూల సేవనమున ఈచూర్ణమును కూడా ఉపయోగించుట వలన వీర్యస్తంభనశక్తి గొప్పగా కల్గుతుంది. కేవలము మూల చూర్ణమును రెండునుండి నాల్గు గురిగింజలమాత్రము వఱకు తాంబూలమునందు వారమునకు రెండురోజులు మాత్రము సేవించినచో స్వప్నమున వీర్యపాతమగు దోషం తొలగుతుంది. ఈరీతిగా తులసి అందఱకూ ఆరోగ్యప్రదమైనది.

తులసీ సేవనము కార్తీక మాసమునందు మాత్రము

చేయరాదు. "అతిసర్వత్రవర్జయేత్" అన్నసూక్తి దీని యందు నూపాటించి సముచితంగా ఉపయోగించిన తులసి సాక్షాత్తు అమృతమే. తులసిపత్రాలతో టీ కాచుకునే విశిష్టప్రయోగం కూడా ఉంది. తేయాకుతో చేసే టీకంటే దీనిలో చాలా ఉత్త మగుణాలున్నాయి. తులసి ఆకులను నీడలో శుష్కింప జేసి అవి నానిచ్చిన నీటి చుక్కలు కంటిలో వేసిన కండ్ల ఎరుపులుతగ్గు తాయి. ఈ ఆకుల రసంతో పుండ్లు కడుగుటకూడ మంచిది. కృమి వ్రణముల యెడ మిక్కిలి ఉపకారం కల్గుతుంది. తులసి పేరుతో కర్పూర తులసి, వనతులసి వంటి పనేకరకాలు ఉన్నాయి. కాని పేరునందు సామ్యముతప్ప అవి పూజనీయములు కావు. వానికీ ఆయాప్రయోజనములుకలవు. కర్పూర మనేకరీతుల త యారుచేస్తారు కాని కర్పూర తులసి నుండి వచ్చేదే శ్రేష్ఠమై నది. మిగిలినవి ధూప దీపాదులందుతప్ప సేవ నౌషధము లందుపయోగించవు,

తులసికి సురస, గ్రామ్య, సులభ, బహుమంజరి, వృన్ద, దేవదుందుభి వంటివి మారు పేర్లు. చరక సుశ్రుతులు మాత్రము దీనిని సురస అని ప్రయోగించుట కన్పడుతుంది. వైద్యశాస్త్రమందు తులసికి ప్రయోజనము బట్టి గొప్పవిలువయు న్నది. ఉపరసంగా దీనిని వినియోగించుట కన్పడుతుంది. కాబట్టి మహౌషధమును గ్రహించి, పవిత్రమగు తత్వమును గుర్తించి విజ్ఞులగు వారు ఇహపర సాధకమగు తులసిని నిత్య ము పెంచుచు ఆరాధించుదురు గాక!

# శ్రీతులసీ మహిమ

పద్మ పురాణమునందు వ్యాసభగవానునిచే తులసి మహిమనుగూర్చి ఈక్రిందివిధంగా చెప్పబడినది.

శ్లో॥ ఇయం సాక్షా న్మహాలక్ష్మీః - తులసీ భగవత్ప్రియా
తస్మా దిమం న పశ్యన్తి - వృక్షజ్ఞానేన జైమినే!॥

తా॥ ఓ జైమిని మహామునీ! ఈతులసి యనునది సాక్షాత్తుగా మహాలక్ష్మియే. ఈమె భగవంతుడగు విష్ణువునకు ప్రియురాలు. కావున తులసిని సామాన్య వృక్షంగా చూడరు.

శ్లో॥ సదైవ తులసీం మర్త్యో - యథైవ భువి సేవతే
తథైవ సేంద్రా విబుధాః - సేవన్తే తాం సురాలయే॥

తా॥ ఏవిధంగా అయితే మానవులెల్లప్పుడు భూలోకమున తులసిని సేవించుచున్నారో ఆవిధముగనే ఇంద్ర సహితులగు దేవతలు స్వర్గలోకమున తులసిని పూజించుచున్నారు.

శ్లో॥ పరబ్రహ్మ స్వరూపేయం - తులసీ యత్రతిష్ఠతి
తత్రైవ కుశలం సర్వం - సుదృఢం ప్రోచ్యతే మయా॥

తా॥ పరబ్రహ్మ స్వరూపిణియగు ఈ తులసి ఎచ్చట నుండునో అచ్చటనే సర్వక్షేమములు నుండునని నేను గట్టిగా చెప్పుచున్నాను.

శ్లో॥ ప్రాప్నోతి మృత్యుకాలే యః - తోయం పాతకవా నపి

తులసీపత్ర గళితం - స యాతి హరిసన్నిధిమ్॥

తా॥ మరణ సమయమున తులసీ దళములనుండి జారిన నీరెవరు పొందుదురో అతఁడు పాపాత్ము డయినను విష్ణుసన్నిధానమునందును. అందుచేతనే మరణింపనున్న క్షణమున తులసి తీర్థము పోయుదురు.

శ్లో॥ తులసీమృత్తికా పుండ్రం - యోమృత్యుసమయేవహేత్
స ముక్త స్సకలైః పాపైః - పురం గచ్ఛతి చక్రిణః॥

తా॥ మరణ సమయమున నెవఁడైతే తులసి మట్టిని ముఖమున బెట్టుకొనునో అతఁడు సమస్తపాపముల నుండి విముక్తుఁడై వైకుంఠమును పొందును.

శ్లో॥ యస్య స్యా త్తులసీపత్రం - ముఖే శిరసి కర్ణయోః
మృత్యుకాలే ద్విజశ్రేష్ఠః - తస్య స్వామీ న భాస్కరిః॥

తా॥ మరణ సమయమున నెవనికి ముఖమున, శిరస్సునందు, చెవుల యందు తులసీ పత్రముండునో వానిని యముఁడు స్వీకరింపడు.

శ్లో॥ యత్రైక స్తులసీ వృక్షః - తిష్ఠత్యపి చ సత్తమ!
తత్రైవ త్రిదశా స్సర్వే - బ్రహ్మవిష్ణు శివాదయః॥

తా॥ ఎక్కడైతే ఒక్క తులసి వృక్షమైన ఉండునోఅక్కడనే బ్రహ్మ విష్ణు శివాదులగు దేవతలందఱు నుందురు.

శ్లో॥ కేశవః పత్రమధ్యే చ - పత్రాగ్రే చ ప్రజాపతిః
పత్రవృంతే శివ స్తిష్ఠే - త్తులస్యా స్సర్వదైవ హి॥

తా॥ ఎల్లప్పుడును తులసి యొక్క పత్రము మధ్యన విష్ణువు, పత్రము చివఱ బ్రహ్మ, తొడిమ భాగమున శివుఁడును ఉందురు.

శ్లో॥ లక్ష్మీ సరస్వతీ చైవ - గాయత్రీ చండికా తథా
సర్వా శ్చాన్యా దేవపత్న్యః తత్పత్రేషు వసంతి హి॥

తా॥ లక్ష్మి, సరస్వతి, గాయత్రి, చండిక అట్లే ఇతర దేవపత్నులును తులసి పత్రములందుందురు.

శ్లో॥ ఇంద్రో ఽగ్ని ర్యమన శ్చైవ - నైరృతి ర్వరుణ స్తథా
పవన శ్చ కుబేర శ్చ - తచ్ఛాఖాయాం వసం త్యమీ॥

తా॥ ఇంద్రుడు, అగ్ని, యముఁడు నిర్బతి. వరుణుఁడు వాయువు, కుబేరుఁడు మున్నగు దిక్పాలకులును తులసి కొమ్మలయం దుందురు.

శ్లో॥ ఆదిత్యాది గ్రహా స్సర్వే - విశ్వేదేవా శ్చ సర్వదా
వసవో మును శ్చైవ - తథా దేవర్షయో ఽఖిలాః॥

తా॥ సూర్యుఁడు మున్నగు గ్రహములు, విశ్వేదేతలు వసువులు, మునులు, దేవర్షులు మున్నగువారిందు నివసించుదురు.

గ్రహములు - 9- సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు బుధుఁడు, గురుఁడు, శుక్రుఁడు, శని, రాహువు, కేతువు విశ్వే దేవతలు - 10 - వసుబంధులు, క్రతుదక్షులు,

కాలములు, ధురివిరోచనులు, పురూరవాద్రవు వసువులు -8- ఆపుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, అధ్వర్యుఁడు అనిలుఁడు, ప్రత్యూషుఁడు, అనలుఁడు, ప్రభాసుఁడు, మునులు - 7 - కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు వశిష్ఠుఁడు, జమదగ్ని దేవర్షులు నారదాద్యులు. తులసిచెట్టు నారాధించుటవలన వీరందఱి నారాధించినట్లగును.

శ్లో॥ కోటిబ్రాహ్మాండ మధ్యేషు - యాని తీర్థాని భూతవే
తులసీదళ మాశ్రిత్య - తాన్యేవ నివసంతి హి॥

తా॥ కోటి బ్రహ్మాండములమధ్య భూతలమున ఏయే తీర్థములున్నవో అవి అన్నియు తులసీదళము నాశ్రయించి యుండును.

శ్లో॥ తులసీం సేవతే యస్తు - భక్తిభావ సమన్వితః
సేవితా స్తేన తీర్థాశ్చ - దేవా బ్రహ్మాదయ స్తథా॥

తా॥ భక్తి భావముతో కూడి ఎవరైతే తులసిని సేవింతురో వారు సకల తీర్థములను సేవించినట్లే. బ్రహ్మాది దేవతలను సేవించినట్లే.

శ్లో॥ ఛిందంతి తృణజాలాని - తులసీమూలజానియే
తద్దేహస్థాం బ్రహ్మహత్యాం - హరి ర్హరతి తత్క్షణాత్॥

తా॥ తులసిచెట్టు మొదటనున్న గడ్డి మున్నగు
పును ఎవరు తీసి వేయుదురో వారి బ్రహ్మహత్యా పాపమ
కూడ విష్ణువు పోగొట్టును.

శ్లో॥ వైశాఖే zక్షతధారాభిః అద్భి ర్య స్తులసీం నరః
సించయే త్సో z శ్వమేధస్య - ఫలం ప్రాప్నోతినిత

తా॥ వైశాఖమున ఆగని జలధారలతో తులసి
నెవరు తడుపుదురో వారు అశ్వమేధ ఫలమును నిత్య
పొందుదురు.

కదాచి త్తులసీం దుగ్ధైః - సేచయేద్యో నరోత్తమః
తస్య వేశ్మని విప్రర్షే! - లక్ష్మీర్భవతి నిశ్చలా॥

తా॥ ఎప్పుడైన పాలతో ఏమానవుత్తముండైన
నచో వానికి తరుగని సంపదకల్గును.

శ్లో॥ గోమయై స్తులసీమూలం - యః కుర్యా దుపవేపన
సమ్మార్జనం చ విప్రర్షే! తస్య పుణ్యఫలం శ్రుణు

తా॥ ఓజైమిని మహర్షీ! ఆవుపేడతో తులసి చెట్టు వె
మూలమున అలికి నీరుచల్లువారికి కల్గు ఫలము చెప్పుచు
వినవలసినది.

శ్లో॥ రజాంసి తత్ర యావన్తి - దూరీ భూతాని జైమిని
తావ త్కల్పసహస్రాణి - విష్ణునామోదతేసదా॥

తా॥ ఆప్రదేశమున దుమ్ముకణములెన్ని దూరము చేయబడునో ఓజైమినీ! అన్నికల్ప సహస్రము లామనుజుఁడు విష్ణులోకమున సుఖించును.

శ్లో॥ ప్రదీపం యస్తు సంధ్యాయాం - స్థాపయేత్తులసీతవే
స యాతి మందిరం విష్ణోః కులకోటి సమన్వితః॥

తా॥ ఎవరైతే తులసిచెట్టుకడ సంధ్యాసమయమున దీపము పెట్టెదరో వారు వైకుంఠము నందెదరు.

శ్లో॥ ప్రభాతే తులసీం పశ్యేత్ - భక్తిమాన్ యో నరోత్తమః
స విష్ణుధర్మనశ్చైవ - ఫలం ప్రాప్నోతి చాక్షయమ్॥

తా॥ భక్తిమంతు లగువారు ఉదయముననే లేచిన వెంటనే తులసీచెట్టును చూచినచో వారు విష్ణుదర్శనము చేసి కొన్న ఫలమునందెదరు.

శ్లో॥ తులసీ స్మరణే నైవ - సర్వ పాపం వినశ్యతి
తులసీ స్పర్శనే నైవ - నశ్యంతి వ్యాధయో నృణాం॥

తా॥ తులసీ స్మరణతోడనే సర్వపాపములు తొలగు తులసిని తాకుటవలన సర్వరోగములు తొలగును.

శ్లో॥ యో z శ్నాతి తులసీ పత్రం - సర్వపాపహరం శుభం
తచ్ఛరీరాంతరస్థాయి - పాపం నశ్యతి తత్క్షణాత్॥

తా॥ సర్వపాపములను పోగొట్టునది, శుభప్రదమైనది, యగు తులసీదళము నెవరు తిందురో వారిశరీరమందలి పాప మంతయు అక్షణమున తొలగును.

శ్లో॥ తులసీకాష్ఠ సంభూతాం - మాలాం వహతి యో నరః
తద్దేహే పాతకం నాస్తి - సత్య మేత న్మ యోచ్యతే॥

తా॥ తులసి కఱ్ఱ ముక్కలతో చేసిన పూసల మాల నెవరు ధరింతురో వారిదేహమున పాపములుండవు. నేనుచెప్పు ఈమాటనిజము.

శ్లో॥ తులసీపత్ర గళితం - య స్తోయం శిరసా వహేత్
గంగాయాః స్నానజం పుణ్యం - లభతే నాత్ర సంశయః॥

తా॥ తులసీ దళములనుండి వచ్చు నీటినెవరు నెత్తిన చలుకొందురో వారు గంగా స్నానమొనర్చిన పుణ్యమును నిస్సం దేహంగా పొందుదురు.

శ్లో॥ దూర్వాభి రక్షితైః పుష్పైః - నై వేద్యై స్తులసీం శుభాం
సమారాధ్య నరో భక్త్యా - విష్ణుపూజాఫలం లభేత్॥

తా॥ గరికయందు తీసికొని వచ్చిన పుష్పముల తోను, నై వేద్య ములతోను శుభప్రదమగు తులసిని భక్తితో పూజించిననరులు విష్ణు పూజాఫలమును పొందుదురు.

# శ్రీతులసీ స్తోత్రమ్

జగద్ధాత్రి! నమస్తుభ్యం - విష్ణోశ్చ ప్రియవల్లభే!
యత్ బ్రహ్మాదయో దేవా - సృష్టి స్థిత్యంత కారిణః॥

నమ స్తులసి కల్యాణి! నమో విష్ణుప్రియే! శుభే!
నమో మోక్షప్రదే! దేవి నమః స్సంపత్ప్రదాయకే!॥

తులసీ పాతు మాం నిత్యం - సర్వాపద్భ్యో ఽపి సర్వదా
కీర్త్యా వాపి స్మృతా వాపి - పవిత్రయతి మానవమ్॥

ACC NO. 14717

నమామి శిరసా దేవీం - తులసీం విలసత్తనుం
యాం దృష్ట్వా పాపినో మర్త్యా - ముచ్యంతే సర్వకిల్బిషాత్॥

తులస్యా రక్షితం సర్వం - జగదేత చ్చరాచరం
యా వినిర్హంతి పాపాని - దృష్ట్వా వా పాపిభిర్నరైః॥

294.53

నమ స్తుల స్యతితరాం - యస్యై బద్ధాంజలిం కలౌ
కలయతి సుఖం సర్వం - స్త్రియో వైశ్యా స్తథాపరే॥

5200

తులస్యా నాపరం కించిత్ - దైవతం జగతే తలే
యయా పవిత్రితో లోకో - విష్ణుసంగేన వైష్ణవః॥

తులస్యాః పల్లవం విష్ణోః - శిర స్యారోపితం కలౌ
అరోపయంతి సర్వాణి - శ్రేయాంసి వరమస్తకే॥

తులస్యాం సకలా దేవా - వసంతి సతతం యతః
అత స్తామర్చయే ల్లోకే - సర్వా న్దేవా న్సమర్చయన్॥

నమ స్తులసి సర్వజ్ఞే! - పురుషోత్తమ వల్లభే!
పాహి మాం సర్వపాపేభ్యః - సర్వసంప త్ప్రదాయకే!॥

ఇతి స్తోత్రం పురాగీతం - పుండరీకేణ ధీమతా
విష్ణు మర్చయతాం నిత్యం - శోభనై స్తులసీదళైః॥

తులసీ శ్రీమహాలక్ష్మీ - ర్విద్యా విద్యాయశస్వినీ
ధర్మ్యాధర్మాననా దేవీ - దేవదేవ మనః ప్రియా॥

లక్ష్మీ ప్రియసఖీ దేవీ - ద్యౌ ర్భూమి రచలా చలా
షోడ శైతాని నామాని - తులస్యాః కీర్తయే న్నరః॥

లభతే సుతరాం భక్తి - మంతే విష్ణు పదం భవేత్
తులసీ భూర్మహాలక్ష్మీః - పద్మినీ శ్రీ ర్హరిప్రియా॥

తులసీ శ్రీసఖి శుభే! - పాప హారిణి! పుణ్యదే!
నమ స్తే నారదనుతే! - నారాయణమనః ప్రియే!॥

ఇతి శ్రీతులసీస్తోత్రం సంపూర్ణం.



# శ్రీ తులసీ కవచమ్

అస్య శ్రీ తులసీకవచ స్తోత్ర మహామంత్రస్య మహాదేవ ఋషిః అనుష్టుప్ ఛందః శ్రీ తులసీ దేవతా; మనసా భీష్ట కామ్యాది సిద్ధ్యర్థః జపే వినియోగః;

తులసీ శ్రీమహాదేవి! నమః పంకజధారిణి
శిరో మే తులసీ పాతు - ఫాలం పాతు యశస్వినీ॥

దృశౌ మే పద్మనయనే - శ్రీసఖీ శ్రవణీ మమ
ఘ్రాణం పాతు సుగంధా మే - ముఖం చ సుముఖీ మమ॥

జిహ్వా మే పాతు శుభదా - కంఠం విద్యామయీ మమ
స్కంధౌ కల్హారిణీ పాతు - హృదయం విష్ణువల్లభా॥

పుణ్యదా మే పాతు మధ్యం - నాభిం సౌభాగ్యదాయినీ
కటిం కుండలినీ పాతు - ఊరుం నారద వందితా॥

జననీ జానునీ పాతు - జంఘే సకలవందితా
నారాయణప్రియా పాదౌ - సర్వాంగం సర్వరక్షణీ॥

సంకటే విషమే దుర్గే - భయే వాదే మహావే
నిత్యం త్రిసంధ్యయోః పాతు - తులసీ సర్వత స్సదా॥

ఇతీదం పరమం గుహ్యం - తులస్యాః కవచామృతమ్
మర్త్యానా మమృతార్థాయ - భీతానా మభయాయ చ ॥

మోక్షాయ చ ముముక్షూణాం - ధ్యాయినాం ధ్యానయోగకృత్
వశ్యాయ వశ్యకామానాం - విద్యాయై వేదవాదినామ్॥

ద్రవిణాయ దరిద్రాణాం - పాపినాం పాపశాంతయే
అన్నాయ క్షుధితానాం చ - స్వర్గాయ శుభ మిచ్ఛతామ్॥

పశవ్యం పశుకామానాం - పుత్రదం పుత్రకాంక్షిణాం
రాజ్యాయ భ్రష్టరాజ్యానాం - అశాంతానాం చ శాంతయే॥

భక్త్యర్థం విష్ణుభక్తానాం - విష్ణో స్సర్వాంతరాత్మనే
జాప్యంత్రివర్గ సిద్ధ్యర్థం - గృహస్థేన విశేషతః॥

ఉద్యతం చంద్రకిరణ - ముపస్థాయ కృతాంజలిః
తులసీకాననే తిష్ఠ - న్నాసీనో వా జపే దిదమ్॥

సర్వా న్కామా నవాప్నోతి - తథైవ మమ సన్నిధిం
మమ ప్రియకరమ్ నిత్యం - హరిభక్తి వివర్ధనమ్॥

యస్యా మృత ప్రజా నారీ - తస్యాంగం పరిమార్జయేత్
సా పుత్రం లభతే దీర్ఘ - జీవనం చా ప్యరోగిణమ్॥

వంధ్యాయా మార్జయే దంగం - కుశై ర్మంత్రేణ సాధకః
సాహి సంవత్సరాదేవ - గర్భం ధత్తే మనోహరమ్॥

అశ్వత్థే రాజవశ్యార్థీ - జపే దగ్నిస్వరూపభాక్
పాలాశమూలే విద్యార్థీ - తేజోర్థ్యాభిముఖో రవేః॥

కన్యార్థీ చండికా గేహే - శత్రుహత్యై గృహే మమ
శ్రీకామో విష్ణుగేహేచ - ఉద్యానే స్త్రీ వశా భవేత్॥

కి మత్ర బహు నోక్తేన - శృణు సైన్యేశ తత్త్వతః
యం యం కామ మభిధ్యాయే- తం తం ప్రాప్నో త్యసంశయమ్

మమ గేహే గత స్త్వంతు - తారకస్య వధేచ్ఛయా
జపన్ స్తోత్రం చ కవచం తులసీగత మానస

మండలా త్తారకం హంతా - భవిష్యసి న సంశయః॥

ఇతిబ్రహ్మాండపురాణే
తులసీమ్మాహాత్మ్యే శ్రీతులసీకవచం

సంపూర్ణం

# తులసి మాలామహిమ

విష్ణు భక్తులగు వైష్ణవులయెడ తులసీ మాలానియమము గట్టిగ చెప్పబడినది.

శ్లో॥ యత్కంఠే తులసీ నాస్తి - తే నరా మూఢమానసాః
అన్నం విష్ఠాజలం మూత్రం - పీయూషం రుధిరం భవేత్

అని తులసి మాలిక కంఠమున లేనివారు మూఢులుగనే చెప్పబడినది. అట్లే

శ్లో॥ యే కంఠలగ్న తులసీనళినాక్షమాలాః
యే వా లలాట ఫలకే లస దూర్ధ్వ పుండ్రాః
యే బాహుమూల పరిచిహ్నిత శంఖ చక్రాః
తే వైష్ణవా భువన మాశు పవిత్రయంతి॥

అని కంఠమున తులసిమాల గల్గిన వైష్ణవ భక్తులచే లోకము పవిత్రమగుచున్నటుల తెలుపబడినది. తులసి కఱ్ఱనుండి పూసలు చేసి వాని మాలిక ధరించుట విష్ణువునకు ప్రీతికరము.

శ్లో॥ తులసీ కాష్ఠ సంభూతే - మాలే! విష్ణుజనప్రియే
త్వాం ధారయా మ్యహం కంఠే - కురుమాం విష్ణువల్లభమ్॥

అనిస్తుతించుచు తులసిమాలను ధరించవలెను.

శ్లో॥ తత స్సర్వేషు కాలేషు - ధార్యా తులసీమాలికా
క్షణార్థం తద్విహీనోऽపి - విష్ణుద్రోహీ భవేన్నరః॥

శ్లో॥ యజ్ఞోపవీతవ ద్ధార్యా - సదా తులసీ మాలికా
క్షణమాత్ర పరిత్యాగాత్ - విష్ణుద్రోహీ భవేన్నరః॥

అని చెప్ప బడుట వలనఅన్ని వేళలను తులసిమాలి కను ధరించ వచ్చునని, జందెమువలె దాని నెప్పుడు తీసివేయక ధరింపఁదగునని, దానిని త్యజించుటవలన విష్ణుద్రోహియగునని తెలియుచున్నది. కావున కంఠమున తులసి మాలధరించుటచే శ్రీ విష్ణుమూర్తికి ప్రియభక్తుడు కాగల్గుననుట యదార్థము. తులసిమాల కంఠమున ధరించుటకేకాక జపమునకు అందును విష్ణుసంబంధములగు మంత్ర జపముల కత్యంత ప్రశస్తమైనది. తులసిమాల హారముగ ధరించిన అశ్వమేధయాగఫలము లభించునని పెద్దల విశ్వాసము.

వసిష్ఠ సంహితయందు తులసీమాలా ప్రతిష్ఠావిధి ఈ క్రింది విధమున చెప్పబడినది. తులసీ మాలికను గ్రహించి శ్రీ మంత్రముతో మార్జన మొనర్చి పంచగవ్యము తోను, పంచామృతములతోను పుణ్యాహజలము తోను కడిగి ఒకరోజు గోమూత్రమున నుంచి దానినుండితీసి శుద్ధజలముతో కడిగి శ్రీపంచాక్షరి తోను, శ్రీసూక్త భూసూక్తములతోను

"మహాదేవ్యై చ విద్మహే - విష్ణుపత్న్యై చ ధీమహి - తన్నో లక్ష్మీః ప్రచోదయాత్"
"ధనుర్ధరాయ విద్మహే - సర్వసిద్ధ్యై చ ధీమహి - తన్నో ధరా ప్రచోదయాత్"

అని శ్రీభూమంత్ర గాయత్రులతోను జపించవలెను. పిదప దానియందు లక్ష్మిని, తులసిని ఆవాహనమొనర్చి గంధ పుష్ప ధూప దీప నైవేద్యాదులతో సర్వోపచారములతోను పూజిం చి స్వగృహ్యోక్త విధానమున అగ్నిముఖమున వైష్ణవీకరణా నంతరము శ్రీమంతముతో 108 పర్యాయములు హోమము చేసి పిమ్మట భూసూక్తముతోను, వాని గాయత్రులతోను హోమమొ నర్చి మాలికను గైకొని శ్రీవిష్ణుదేవుని పాదారవిందముల సమ ర్పించి దానినిగ్రహించివెంటనే నూరు పర్యాయములు శ్రీమంత మును జపింపవలెను.

---

# తులసిని గూర్చిన గాథలు

శ్రీకృష్ణభగవానుడు గోపకులంలో జన్మించాడు. శ్రీరాముని అవతారంలో ఆతని ఆలింగమునకు నోచుకోని ఋషులందఱు వ్రేపల్లెలో గోపకాంతలుగా అవతరించారు. ద్వైతభ్రాంతి వీడి శ్రీకృష్ణ పరమాత్మలో ఐక్యముచెందు గోపకాంతలకు అద్వైతానందానుభవము క్రీడాప్రాయము. అటువంటి అనుభవమున కృష్ణునిలో లీనమైయున్న ఒక గోపికను రాధాదేవి చూచించింది. కృష్ణు నెడబాటులో నున్న ఆమెలో మానుష సహజమైన అసూయ పొంగి వచ్చింది. నీవు భూలోకమున జనింతువుగాక! అని శపించింది. భయాందోళనలు వ్యాపించిన ఆగోపిక శ్రీకృష్ణపరమాత్మను ప్రార్థించింది. శ్రీకృష్ణుడు భూలోకంలో జన్మించిన నీవు కొంత కాలము తపస్సు చేసినన్ను చేర గలవు అని అభయమిచ్చాడు.

ఆశాపగ్రస్తయైన గోపికయే మాధవీ ధర్మధ్వజులకు పుత్రికగా జన్మించింది. కార్తీక పౌర్ణమినాడు జన్మించి పూర్ణ చంద్ర శోభతో అసామాన్య సౌందర్యవతిగానున్న ఆమెకు 'తులసి' అని నామకరణం చేశారు. బాల్యవయస్సునుండే తాను కృష్ణునకు దూరమైన ఆవేదన తొందరచేయ సాగింది. తులసి అడవికి వెళ్ళి తపస్సుచేయ నారంభించింది.

సుధామ గోపాలుడు రాధ శాపం వలననే శ్రీకృష్ణు నంశంతో శంఖచూడుడను రాక్షసునిగా భూలోకంలో జన్మించాడు. బ్రహ్మగూర్చి తపస్సుచేసి ఎవ్వరివలన తాను మరణించ

నట్లు వరమడిగాడు. ఒక్క షరతుమీద బ్రహ్మవరమిచ్చాడు. అతని భార్య శీలమునకు భంగము వాటిల్లనంతవరకు అతనికి ఎవ్వరి వలనను చావులేదని వరమిచ్చి బ్రహ్మదేవుడంతర్థానం చెందాడు.

శంఖచూడుడు తులసిని వివాహం చేసుకున్నాడు. అతని శక్తికి ఎదురు లేదు. అతని బలదర్పాలను చూచి దేవతలు భయపడ్డారు. వారందరు కలిసి త్రిమూర్తులను వేడుకొని తమ బాధను తెలియజేశారు. శివుడు శంఖచూడునితో యుద్ధం సాగించాడు ఆసమయంలో శ్రీమహావిష్ణువు తన అంశావతారమైన శంఖచూడునిగా మారి తులసిని చేరాడు. విష్ణుమాయ నెరిగిన తులసి "రాబోవు జన్మయందు శిలగామారి నీపూర్వ వృత్తాంతమును మరతువుగాక!" అనిశపించింది. కాని వెంటనే తన సర్వస్వమైన విష్ణుమూర్తిని గ్రహించి పశ్చాత్తప్తయై శరణువేడింది. శ్రీమహావిష్ణువను గ్రహించి "తులసీ! నీవు లక్ష్మీ స్వరూపిణివై నాతో శాశ్వతముగ నుండగలవు. నీఈశరీరము గండకి నదిగా, నీశిరోజములు తులసిమొక్కగా మారిపోగలవు" అని అభయ మొసగాడు. ఈరీతిగా బ్రహ్మ వైవర్త పురాణగాథ కన్పడుతుంది.

పద్మ పురాణాతర్గతగాథ ఇలాగుంది. జరాసంధుని భార్య బృంద. ఆమెపై శ్రీమహావిష్ణువునకనురాగం కల్గింది. ఈకళంకంనుండి విష్ణువును రక్షించవలసిందిగా దేవతలు బ్రహ్మదేవుని నికోరారు. అతని సలహా ప్రకారము దేవతలుమాయా

దేవిని ప్రార్థించారు మాయాదేవి చెప్పిన మంత్రంతో దేవతలు విష్ణువు వద్దకు వెళ్ళి ఆతనివద్ద ఆమంత్రం వల్లించారు. వెంటనే ధాత్రి, మాలతి, తులసి అనేమూడుచెట్లు మొలిచాయి. ఆచెట్లను చూడగానే విష్ణువునకు కల్గిన వ్యామోహం మాయమయింది.

ఒకప్పుడు తులసి గణేశుని యెడ అమర్యాదగా ప్రవర్తించినదట. ఈప్రవర్తనకు కోపగించిన గణేశుడు తులసిని చెట్టువు కమ్మని ఈ రీతిగాశపించాడు.

శ్లో॥ ప్రియా త్వం సర్వదేవానాం - కృష్ణస్య చ విశేషతః
పూజా విముక్తిదా నౄణాం మమ త్యాజ్యా చ సర్వదా

"ఓతులసీ! సకలదేవతలకు నీవిష్ణురాలవే. అందునా శ్రీకృష్ణునకు విశేషించి ప్రియమైన దానవు. నీపూజవలన నరులకు ముక్తి కల్గును. కాని ఎప్పుడూ నాకుమాత్రం నీవుత్యజింపదగిన దానవు. నాపూజకు నీవుతగవు అనిభావము ఈరీతిగా తులసి దళములు వినాయకునకుతగవు.

ఈరీతిగా తులసికి సంబంధించిన గాధలు ఆయాపురాణాలలో కానవస్తాయి.

స్త్రీలు ప్రతినిత్యము పఠింప దగిన

# పుండరీక కృత తులసీ స్తోత్రము

1. జగద్ధాత్రి నమ స్తుభ్యం - విష్ణో శ్చ ప్రియవల్లభే
యతో బ్రహాదయో దేవాహః - సృష్టి స్థిత్యంత కారిణః॥

2. నమ స్తులసి! కల్యాణి - నమో విష్ణుప్రియే!శుభే!
నమో మోక్షప్రదే! దేవి! నమ స్సంపత్ప్రదాయికే॥

3. తులసీ పాతు మాం నిత్యం - సర్వాపద్భ్యో Z పిసర్వథా
కీర్తితాపి స్మృతా వాపి - పవిత్రయతి మానవమ్॥

4. నమామి శిరసా దేవీం - తులసీం విలస త్తనుం
యాం దృష్ట్వా పాపినోమర్త్యా - ముచ్య న్తే సర్వకిల్బిషాత్॥

5. తులస్యాం రక్షితం సర్వం - జగదేత చ్చరాచరం
యా వినిర్హంతి పాపాని - దృష్టా వా పాపిభి ర్నరైః॥

6. నమ స్తుల స్యతితరాం - యస్యై బద్ధాంజలిం కలౌ
కలయ న్తి సుఖం సర్వం - స్త్రియో వైశ్యాస్తథాపరే॥

7. తులస్యా నాపరం కించిత్ - దైవతం జగతీతవే
యథా పవిత్రితో లోకో - విష్ణుసంగేన వైష్ణవః॥

8. తులస్యాం ల్లవః విపష్ణోః - శిర స్యారోపితం కలౌ
ఆరోపయతి సర్వాణి శ్రేయాంసి వరమస్తకే॥

9. తులస్యాం సకలా దేవా - వసన్తి సతతం యతః
అత స్తా మర్చయే ల్లోకే - సర్వాన్ దేవాన్ సమర్చయన్॥

10. నమ స్తులసి సర్వజ్ఞే - పురుషోత్తమ వల్లభే
పాహి మాం సర్వపాపేభ్యః - సర్వసంపత్ప్రదాయికే॥

11. ఇతి స్తోత్రం పురా గీతం - పుండరీకేణ ధీమతా
విష్ణు మర్చయతా నిత్యం - శోభనై స్తులసీ దళైః॥

12. తులసీ శ్రీ ర్మహాలక్ష్మీః - విద్యా విద్యాయశస్వినీ
ధర్మ్యా ధర్మ్యా వరా దేవీ - దేవ దేవ మనఃప్రియా॥

13. లక్ష్మీ ప్రియసఖీ దేవీ - ద్యౌర్భూమి రచలా చలా
షోడ శైతాని నామాని - తులస్యాః కీర్తయేన్నరః॥

14. లభతే సుతరాం భక్తిం - అంతే విష్ణుపదం లభేత్
తులసీ భూ ర్మహాలక్ష్మీ - పద్మినీ శ్రీర్హరిప్రియా॥

15. తులసి! శ్రీసఖి! శుభే! పాపహారిణీ! పుణ్యదే!
నమ స్తే నారదనుతే! - నారాయణ మనః ప్రియే॥

(శ్రీ పుండరీక కృతమగు ఈతులసీ స్తోత్రమును నిత్య సౌభాగ్య పుత్ర పౌత్రాభివృద్ధి కోరు స్త్రీలు ప్రతి నిత్యమును పఠింప దగునని పెద్దలు చెప్పుచున్నారు.)

# తులసి పూజావిధానము

ఆచమనమొనర్చి సామాన్య పూజకు వలెనే సంకల్పము నొనర్చవలెను. సంకల్పమున "శ్రీతులసీ సన్నిధౌ" అని తిధి వారాములను చెప్పి "ఆత్మనః సర్వాభీష్ట సిద్ధ్యర్థం, భోగ మోక్ష సిద్ధ్యర్థం, భర్త్రాసహ అఖండిత సుఖ సౌభాగ్య సంతత్యాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, తులసీ దేవతా ప్రీత్యర్థం బృందావనే తులసీ పూజాం కారిష్యే (అనినీటినితాకవలెను.) కలశారాధనదీపారాధనలను గావించి తులసీధ్యానము నీరీతిగా చేయవలెను.

ధ్యానమ్:-

శ్లో॥ ధ్యాయేచ్చ తులసీం దేవీం - శ్యామాం కమలలోచనాం
ప్రసన్నాం పద్మవదనాం - వరాభయ చతుర్భుజామ్॥
కిరీట హార కేయూర - కుండలాది విభూషణామ్
ధళాంకుశ సంయుక్తాం - పద్మాసన నిషేవితామ్॥
ప్రియాం చ సర్వదా విష్ణోః - సర్వదేవ నమస్కృతామ్॥

అని ధ్యాన మొనర్చిన పిదప సర్వోపచారముల నీ క్రింది విధముగా నాచరింపవలెను.

శ్లో॥ దేవి! త్రైలోక్య జనని! సర్వలోకైక పావని!
ఆగచ్ఛ వరదే! మాతః! ప్రసీద తులసీ ప్రియే॥

శ్రీతులస్యైనమః ఆవాహనం సమర్పయామి

శ్లో॥ సర్వదేవమయే! దేవీ! సర్వదా! విష్ణువల్లభే!
దేవి! స్వర్ణమయం దివ్యం - గృహాణాసన మవ్యయే!॥

శ్రీ తులస్యైనమః నవరత్నఖచిత స్వర్ణసింహాసనం సమర్పయామి. హేదేవి! స్థిరాభవ, సుముఖాభవ సుప్రసన్నాభవ స్థిరాసనంకురు.

శ్లో॥ సర్వే దేవేయథాస్వర్గే - తథా త్వం భువి సర్వదా
దత్తం పాద్యం గృహాణేదం - తులసి! త్వం ప్రసీద మే॥
శ్రీ తులస్యైనమః పాదయోః పాద్యం సమర్పయామి.

శ్లో॥ గంధపుష్ప సమాయుక్తం - సర్వేషాం ప్రీతిదాయకం
అర్ఘ్యం గృహాణ త్వం దేవి! దైత్యాంతకరణ ప్రియే!
శ్రీ తులస్యైనమః హస్తయోరర్ఘ్యం సమర్పయామి.

శ్లో॥ కర్పూరవాసితం తోయం - సువర్ణకలశే స్థితం
దత్త మాచమనీయం చ - గృహాణ హరివల్లభే!॥
శ్రీ తులస్యైనమః శుద్ధా చమనీయం సమర్పయామి.

శ్లో॥ స్వర్ణపాత్రే సమానీతం - దధిఖండ మధుప్లుతం
మధుపర్కం గృహాణేదం - మయా దత్తం సురేశ్వరి!
శ్రీ తులస్యైనమః మధుపర్కం సమర్పయామి.

శ్లో॥ పంచామృతం మయానీతం - పయో దధిఘృతం మధు
సహ శర్కరయా దేవి! స్నానార్థం ప్రతిగృహ్యతామ్॥
శ్రీ తులస్యైనమః పంచామృత స్నానం సమర్పయామి

శ్లో॥ గంగా గోదావరీ కృష్ణా - పయోష్ణ్యా ద్యాపగా స్తథా
ఆయాన్తు తా స్సదా దేవ్య - స్తులసీ స్నాన కర్మణి॥
శ్రీ తులస్యైనమః మలాపకర్షణ స్నానం సమర్పయామి

శ్లో॥ గంగా సరస్వతీ రేవా - పయోష్ణే నర్మదా జలైః
స్నాపితాఽసి యథా దేవి! - తథా శాంతిం కురుష్వ మే॥

శ్రీ తులస్యైనమః శుద్ధోదక స్నానం సమర్పయామి

శ్లో॥ కృష్ణా సరస్వతీ కాళీ - తుంగభద్రా శచీ తథా
భాగీరథీ పార్వతీ చ - రమా నారాయణీ కృపీ
సుభద్రా ద్రౌపదీ సాధ్వీ - మాతా చైవా ప్యరుంధతీ
సావిత్రీ కాశికా ऽహల్యా - స్నాపయిష్యంతు సర్వదా॥
అభిఃకృ తాభిషేకా త్వం - దదా స్యధిక మంగళం
అత స్త్వాం స్నాపయిష్యామి - తులసి! విష్ణువల్లభే॥

శాంతి స్సుశాంతి శ్శాంతిర్భవతు అమృతాऽభిషేకోऽస్తు
శ్రీతులస్యైనమః అభిషేకంస మర్పయామి.

అభిషేకాంతే ఆచమనీయం సమర్పయామి.

శ్లో॥ క్షీరోద మథ నోద్భూతే - చంద్ర లక్ష్మీ సహోదరే!
గృహ్యతాం పరిధానార్థ - మిదం క్షేమాంబరం శుభే॥

శ్రీతులస్యైనమః వస్త్రం సమర్పయామి.

శ్లో॥ కంచుకీ ముపవస్త్రం చ నానారత్నై స్సమన్వితం
గృహాణ త్వం మయా దత్తం - తులసీ భవహారిణి!॥

శ్రీ తులస్యైనమః కంచుకీ ముపవస్త్రంచసమర్పయామి

శ్లో॥ కేస రాగరు సంయుక్తం - చందనాది సమన్వితం
కస్తూరికా సమాయుక్తం కుంకుమం ప్రతిగృహ్యతామ్

శ్రీ తులస్యైనమః కుంకుమం సమర్పయామి.

శ్లో॥ అక్షతాం శ్చ మహాదేవి! తులసీ భాగ్యదాయికే!
అర్పయామి సదా భక్త్యా - సుఖసంతతి లబ్ధయే॥

శ్రీ తులస్యైనమః అక్షతాన్ సమర్పయామి.

శ్లో॥ హరిద్రా కుంకుమం చైవ - సిధూరం కజ్జలాన్వితం
మయా నివేదితం భక్త్యా - గృహాణ పరమేశ్వరి॥

శ్రీ తులస్యైనమః సౌభాగ్యద్రవ్యాణి సమర్పయామి

శ్లో॥ మాల్యాదీని సుగంధీని - మాలత్యాదీని సత్తమే
మయా హృతాని పూజార్థం - పుష్పాణిప్రతిగృహ్యతామ్

శ్రీ తులసీదేవ్యైనమః పుష్పాణి సమర్పయామి.

అష్టోత్తరశతనామములను చెప్పుచూ పూజగావించ వలెను.

# అష్టోత్తర శతనామావళిః

ఓం తులసీదేవ్యైనమః

ఓం శ్రీసఖ్యైనమః

ఓం శ్రీ భద్రాయైనమః

ఓం శ్రీమనోజ్ఞాన పల్లవాయైనమః

ఓం పురంధరసతీ పూజ్యాయైనమః

ఓం పుణ్యదాయైనమః

ఓం పుణ్యరూపిణ్యైనమః

ఓం జ్ఞానవిజ్ఞానజనన్యైనమః

ఓం తత్త్వ జ్ఞాన స్వరూపిణ్యైనమః

ఓం జానకీ దుఃఖ శమన్యైనమః

ఓం జనార్దన ప్రియాయైనమః

ఓం సర్వ కల్మష సంహర్త్ర్యైనమః

ఓం స్మరకోటి సమప్రభాయైనమః

ఓం పాంచాలీ పూజ్యచరణా యైనమః

ఓం పాపారణ్య దవానలాయైనమః

ఓం కామితార్థ ప్రదాయైనమః

ఓం గౌరీ శారదా సంసేవితాయైనమః

ఓం వందారు జన మందారాయైనమః

ఓం నిలింపాభరణా సక్తాయైనమః

ఓం లక్ష్మీ చంద్ర సహోదర్యైనమః

ఓం సనకాది మునిధ్యేయాయైనమః

ఓం కృష్ణా నంద జనిత్ర్యైనమః

ఓం చిదానంద స్వరూపిణ్యైనమః

ఓం నారాయణ్యైనమః

ఓం సత్యరూపాయైనమః

ఓం మాయాతీతాయైనమః

ఓం మహేశ్వర్యైనమః

ఓం శుభప్రదాయైనమః

ఓం వదనచ్ఛవి నిర్ధూతరాకాపూర్ణ నిశాకరాయైనమః

ఓం రోచనాపంక తిలక లసన్నిటల భాసురాయైనమః

ఓం శుద్ధాయైనమః

ఓం పల్లవోష్ఠ్యైనమః

ఓం పద్మముఖ్యై నమః

ఓం ఫుల్లపద్మదళేక్షణాయైనమః

ఓం చాంపేయ కలికాకార నాసాదండ విరాజితాయై నమః

ఓం మందస్మితాయైనమః

ఓం మంజులాంగ్యైనమః

ఓం మాధవ ప్రియ భామిన్యైనమః

ఓం మాణిక్య కంకణాకారాయైనమః

ఓం మణికుండల మండితాయైనమః

ఓం ఇంద్ర సంపత్కర్యై నమః
ఓం శక్త్యై నమః
ఓం ఇంద్రగోపనిభాంశుకాయై నమః
ఓం క్షీరాబ్ధి తనయాయై నమః
ఓం క్షీరసాగర సంభవాయై నమః
ఓం శాంతి కాంతి గుణో పేతాయై నమః
ఓం బృందానుగుణ సంపత్త్యై నమః
ఓం పూతాత్మాయై నమః
ఓం పూతనాది స్వరూపిణ్యై నమః
ఓం యోగిధ్యేయాయై నమః
ఓం యోగానంద విదాయై నమః
ఓం చతుర్వర్గ ప్రదారామాయై నమః
ఓం చతుర్వైర్గైక పావనాయై నమః
ఓం త్రిలోక జనన్యై నమః
ఓం గృహమేధి సమారాధ్యాయై నమః
ఓం సదనాంగణ పావనాయై నమః
ఓం మునీంద్ర హృదయావాసాయై నమః
ఓం మూల ప్రకృతి సంజ్ఞికాయై నమః
ఓం బ్రహ్మరూపిణ్యై నమః
ఓం పరంజ్యోతిషే నమః

ఓం అవాఙ్మానసగోచరాయైనమః

ఓం పంచభూతాత్మికాయైనమః

ఓం యోగాచ్యుతాయైనమః

ఓం యజ్ఞరూపిణ్యైనమః

ఓం సంసారదుఃఖశమన్యైనమః

ఓం సృష్టిస్థిత్యంతకారిణ్యైనమః

ఓం సర్వప్రపంచనిర్మాత్ర్యైనమః

ఓం వైష్ణవ్యైనమః

ఓం మధురస్వరాయైనమః

ఓం నిరీశ్వరాయై నమః

ఓం నిర్గుణాయైనమః

ఓం నిత్యాయైనమః

ఓం నిరాటంకాయైనమః

ఓం దీనజనపాలన తత్పరాయైనమః

ఓం రణత్కింకిణీ జాలరత్న కాంచీలసత్కట్యైనమః

ఓం చలన్మంజీరచరణాయైనమః

ఓం చతురాననసేవితాయైనమః

ఓం అహోరాత్ర కారిణ్యైనమః

ఓం ముక్తాహారభరాక్రాంతాయైనమః

ఓం ముద్రికారత్న భాసురాయైనమః

ఓం సిద్ధిప్రదాయైనమః

ఓం అమలాయైనమః

ఓం కమలాయైనమః

ఓం లోకసుందర్యైనమః

ఓం హేమకుంభకుచద్వయాయైనమః

ఓం లసిత కుంభద్వయాయై నమః

ఓం చంచలాయైనమః

ఓం లక్ష్మ్యైనమః

ఓం శ్రీకృష్ణ ప్రియాయైనమః

ఓం శ్రీరామప్రియాయైనమః

ఓం శ్రీవిష్ణుప్రియాయైనమః

ఓం శంకర్యైనమః

ఓం శివశంకర్యైనమః

ఓం శ్రీతులస్యైనమః

ఓం కుందుకుట్మలరదనాయైమనః

ఓం పక్వ బింబోష్ఠ్యైనమః

ఓం శరచ్చంద్రి కాయైనమః

ఓం చాంపేయ నాసికాయైనమః

ఓం కంబుసుందరగళాయైనమః

ఓం తటిల్లతాంగ్యైనమః
ఓం మత్తబంభర కుంతలాయైనమః
ఓం నక్షత్ర నిభనఖాయైనమః
ఓం రంభానిభోరుయుగ్మాయైనమః
ఓం సైకతశ్రోణ్యైనమః
ఓం మదకంఠీరవ మధ్యాయైనమః
ఓం కీరవాణ్యైనమః
ఓం శ్రీ మహాతుల్యస్యైనమః

శ్రీ తులసీ దేవ్యైనమః అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి.

శ్లో॥ వనస్పతి రసోద్భూతో - గంధాఢ్యో గంధ ఉత్తమః
ఆఘ్రేయ స్సర్వదేవానాం - ధూపోఽయం ప్రతిగృహ్యతామ్

శ్రీ తులస్యైనమః ధూప మాఘ్రాపయామి.

శ్లో॥ వైశ్వానర ప్రజ్వలితం - ఘృతకార్పాస నిర్మితం
దీపం భక్త్యా గృహాణేదం - త్రైలోక్యధ్వాన్త నాశికే!॥

శ్రీ తులస్యైనమః దీపందర్శయామి.

శ్లో॥ అన్నం చతుర్విధం స్వాదు - రసైష్షడ్భి స్సమన్వితం
నైవేద్యం గృహ్యతాం దేవి! తులసి! మాధవప్రియే!॥

శ్రీ తులస్యైనమః నైవేద్యం సమర్పయామి.

(అని ఆపోశనము నాచరించి ఓం ప్రాణాయస్వాహా; ఓం అపానాయస్వాహా; ఓం వ్యానాయస్వాహా; ఓం ఉదానాయస్వాహా; ఓం సమానాయస్వాహా; అని నైవేద్యము పెట్టి పానీయ ఉత్తరాపోశనహస్త పాదప్రక్షాళనాచమనాదు లొనర్చ వలెను.)

శ్లో॥ సర్వలోకప్రియే! దేవి గంధ ద్రవ్య సమన్వితం
పానీయం తే మయాదత్తం – సంగృహాణ సురేశ్వరి!॥

శ్రీ తులస్యైనమః పానీయం సమర్పయామి.

శ్లో॥ అమృతార్ణవ సంభూతే – భక్త వాంఛిత దాయికే
హస్తౌ ప్రక్షాళనం దేవి! కురు సర్వాఘ నాశిని!॥

శ్రీ తులస్యైనమః హస్తౌ ప్రక్షాళయామి

శ్లో॥ ఇదం ఫలం మయా దేవి! స్థాపితం పురత స్తవ
తేన మే సఫలా వాప్తి – ర్భవే జ్జన్మని జన్మని॥

శ్రీ తులస్యైనమః ఫలంసమర్పయామి

శ్లో॥ పూగీ ఫలం మహ ద్దివ్యం – నాగవల్లీదళై ర్యుతం
కర్పూ రైలా సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్

శ్రీ తులసైనమః తాంబూలం సమర్పయామి.

శ్లో॥ నీరాజయామి సతతం – హరివల్లభే ऽద్య
కర్పూరవర్తిభి రలం సుఖదాయికే! తాం
పాదౌ భజా మ్యవిరతం తవ దేవి! మాయే!
వంశాయు సౌఖ్య మపి దహి బలం చ పూర్ణమ్॥

శ్రీ తులస్యైనమః ఆనందకర్పూర నీరాజనం దర్శయామి

శ్లో॥ పద్మనాభప్రియే నిత్యం - పద్మోద్భవ సమర్చితే
పద్మపత్ర విశాలాక్షి! వరదా భవ శోభనే॥

శ్లో॥ ఉపచారేషు య న్న్యూనం - పూజాకాలే చ యత్కృతం
సర్వసంపూర్ణతాం యాతి - మంత్రపుష్ప ప్రదానతః॥

" ॥ విష్ణుప్రియకరే! దేవి! తులసి! సుఖదాయికే!
పుష్పాంజలిం ప్రయుచ్ఛామి- పతే రాయుష్య వర్ధని'
శ్రీ తులస్యైనమః సువర్ణదివ్యమంత్రపుష్పంసమర్పయామి

శ్లో॥ ప్రదక్షిణం కరోమిత్వాం జగన్నాథే! మహేశ్వరి!
పదే పదే చ సౌభాగ్యం మమ దేహి వరాననే!॥

శ్లో॥ యాని కాని చ పాపాని - జన్మాంతర కృతాని చ
తాని తాని ప్రణశ్యంతి - ప్రదక్షిణ పదే పదే॥

శ్లో॥ నమ స్తే గార్హపత్యాయ - నమ స్తే దక్షిణాగ్నయే
నమ ఆహవనీయాయ తులస్యై తే నమోనమః

శ్లో॥ నమోనమో జగద్ధాత్ర్యై - జగదాద్యై నమోఽస్తుతే
నమోనమో జగద్భూత్యై - నమస్తే పరమేశ్వరి!

శ్లో॥ నమస్తే దేవి! కల్యాణి! నమ స్తులసి సర్వగే!
నమో వేదమయే దేవి! నమస్తే హరివల్లభే!॥

శ్రీతులస్యై నమః ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి

శ్లో॥ గంధ ప్రసూన సంయుక్తం - ఫలముద్రాది శోభితం
అర్ఘ్యం దదామి తులసి తవ ప్రీత్యై నమోనమః॥

శ్రీ తులస్యైనమః అర్ఘ్యత్రయం సమర్పయామి.

అని మూడుమార్లు అర్ఘ్య మీయవలెను.

:-ప్రార్థన:-

శ్లో॥ ప్రసీద మే త్వం సర్వత్ర - కృపయా పరయా ముదా
అభీష్టఫల సంసిద్ధిం - కురు మే మాధవ ప్రియే!॥

శ్లో॥ సౌభాగ్యం సంతతిం దేవి! ధనం ధాన్యం చ మే సదా
ఆరోగ్యం శోకశమనం - కురు మే మాధవప్రియే!॥

శ్లో॥ అభీష్ట ఫలసిద్ధిం చ - సదాదే హి హరిప్రియే!
దేవై స్త్వం నిర్మితా పూర్వ - మర్చితాऽసి మునీశ్వరైః॥

శ్లో॥ అతో మాం సర్వదా భక్తాం - కృపాదృష్ట్యా విలోకయ
పతే రాయు శ్చ భాగ్యం చ - సదా దేహి హరిప్రియే!॥

శ్లో॥ పూతనాభయ సంత్రాసా - దక్షితశ్చ యథా హరిః
తథా సంసార సంత్రాసా - ద్రక్ష మే వంశముత్తమమ్॥

(అనిప్రార్థనమొనర్చి 'యాని కానిచ శ్లోకము చదువుచు ప్రదక్షిణమొనర్చి నమస్కరించిన పిదప) అనయాధ్యానావాహనాది షోడశోపచార పూజయా శ్రీతులసీ దేవతా సుప్రీతాసుప్రసన్నా వరదాభవతు 'సర్వం శ్రీతులసీ దేవ్యర్పణమస్తు' అని అక్షతలతో నీరు విడువవలెను.

# శ్రీ తులసీ స్తోత్రాంతరము

శ్లో॥ యా నారాయణ వల్లభా సులలితా శృంగారరాశీ కృతా
యా దేవీ సుర సిద్ధ సాధ్య మునిభి స్సంస్తూయమానా సదా
క్షీరాంభోనిధి కన్యకా శ్రితజనశ్రేయోవిధాటీ రతా
లోకత్రాణపరాని రస్త కలుషా తస్యై తులస్యైనమః॥

శ్లో॥ యన్నామస్మరణేన పాప మఖిలం జన్మాంతరే సంచితం
వాచా మానవ దేహ దోష జనితం పాపం జస్యైర్య తత్కృతం
జ్ఞానాజ్ఞాన ప్రకాశ రచితరఘుర్వా దుర్వా దనష్ట భవేత్
మృత్యుర్వా పరితః ప్రణశ్యతి హతః తస్యై తులస్యై నమః

శ్లో॥ యచ్ఛాఖా విషయా తదావనజలం లోకత్రయం సంస్పృశేత్
నానానేక మనోజ్ఞ పుణ్యతటినీ సంజాత తీర్థైస్సమం
యన్మూలాగ్రిమ మృత్తి కామలహరీ జ్ఞానప్రదా సర్వదా
యస్యాః దాస్యవిధౌ సుదేవవనితాః తస్యై తుల స్యై నమః॥

శ్లో॥ యద్రాజ ద్వికచాగ్రకోమలదళై ర్యఃపూజయిత్వా హరిం
సద్భక్త్యా సతతం సరోజనయనం లోకేశ్వరం కేశవం
తత్తీర్థస్థిత మేక మంచిత దళస్యార్థ స్వభక్త్యా చరే
సంప్రాపోన్నతి పరం పదం సుఖకరం తస్యై తులస్యై నమః॥

శ్లో॥ యా దృష్టా నిఖిలాఘ సంఘ శమనీ స్పృష్టా పునః పావనీ
శుద్ధానా మభినందితా నిజరసై స్సిక్తాzంతక త్రాసినీ
ప్రత్యాసన్ని విధాయినీ భగవతః కృష్ణస్య సంరోపితా
న్యస్తా తచ్చరణే విముక్తి ఫలదా తస్యై తులస్యై నమః॥
ఇతి తులసీ స్తోత్రాంతరం సంపూర్ణమ్.

శ్రీ మహా గారుడ పురాణాంతర్గత

## తులసీ కవచమ్

అస్య శ్రీ తులసీకవచస్తోత్ర మహామంత్రస్య ఈశ్వర ఋషిః
అనుష్టుప్ఛందః శ్రీ తులసీదేవతా, తులసీప్రీత్యర్థేజపే వినియోగః॥

తులసీ మే శిరః పాతు ఫాలం పంకజధారిణీ
దృశౌ మే పద్మనయనా శ్రీ సఖీశ్రవణం మమ,
ఘ్రాణం సుగంధా మే పాతు ముఖే చంద్రముఖీ మమ
ఓష్ఠౌ హరి ప్రియా పాతు- ఛుబుకం పాతు పావనీ
శుభా మే రక్షతాం జిహ్వాం-కర్ణౌ విద్యా స్వరూపిణీ
స్కంధౌ కల్హారిణీ పాతు భుజౌ మే పాపహారిణీ.
కరౌ పద్మకరా పాతు హృదయంవిష్ణువల్లభా
పుణ్యదా మధ్యమం పాతు నాభిం సౌభాగ్యవర్ధనీ.
ఆదిం కంజలినీ పాతు ఊరూ నారదవందితా
జననీ జానునీ పాతు సర్వాంగం సర్వ రక్షకా.
సంకటే విషమే దుర్గే భయా ర్తాతిమహాద్భుతౌ
నిత్యం సా సంధ్యయోః పాతు తులసీ సర్వసర్వదా.
య ఇదం పరమం గుహ్యం తులస్యాః కవచామృతం
నమస్తే తులసీ శుద్ధే శ్రీ సఖీ పాపహారణి.
నమస్తే తులసీదేవి నమస్తే విష్ణువల్లభే
నమస్తే నారదనుతే నారాయణి నమోఽస్తుతే.

ఇతి శ్రీ మహాగారుడ పురాణే బ్రహ్మ నారద సంవాదే తులసీ కవచం సంపూర్ణమ్.

—o—

# శ్రీ తులసి విషయమున నియమములు

మఱియొక విశేషమేమన తులసీదళమునకు నిన్నటిది మొన్నటిది అని నిలవయున్న దోషములేదు. ఈ విషయమున విష్ణుధర్మోత్తర పురాణమున ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ తులస్యాం బిల్వపత్రే చ జలజేషు చ సర్వశః
న పర్యుషితదోషో z స్తి -మాలాకారగృహేషు చ॥

అని. ఆనియమము స్కాందరాపుణమున

శ్లో॥ పలాశం దిన మేకం తు - పంకజం చ దిన త్రయం
పంచాహం బిల్వపత్రం చ - దశాహం తులసీదళమ్ ॥

అని చెప్పబడింది అనగా మోదుగ ఒకరోజు నిల్వయుం. న్నను, పద్మము మూడురోజులు నిల్వయున్నను, మారేడుదళము ఐదురోజులు నిల్వయున్నను తులసిదళము పదిరోజులు నిల్వయున్నను అర్చనకు పనికివచ్చును.

'దేవార్థే తులసీ చ్ఛేదో - హోమార్థే సమిధ స్తథా'

అని చెప్పబడుటవలన దేవతార్చనకై తులసిని ఛేదించుట దోషము కాదని తెలియుచున్నది. అంత పవిత్రమైనది. లక్ష్మీ సదృశమైనదియగు తులసిని ఛేదించుటలో సంశయింప బనిలేదు. దైవతముల అర్చనయందు ప్రాముఖ్యతయే అట్లుఛేదించుట కవకాశమిచ్చుచున్నది.

కోమలములగు తులసీ దళములతో శ్రీహరిని ఎవరు పూజింతురో వారికి కోటి కోటి సువర్ణదాన ఫలమును లభించునని పూలగుత్తి, దళములతో కలిసిన తులసిచే హరిని నిత్యము పూజించువారు పూజా ఫలమును గొప్పగా పొందుదురనియు

శ్లో॥ యేఽర్చయంతి హరే ర్మూర్తిం - కోమలై స్తులసీదళైః
కోటి కోటి సువర్ణానాం - దానస్య ఫల మాప్నుయుః॥

శ్లో॥ సుమంజర్యా సదళయా - తులసీ భవయా హరేః
పూజాం కుర్వీత యో నిత్యం - సుపూజా ఫల మశ్నుతే॥

అను స్కాంద పురాణ మందలి అవంతీ ఖండమునను న్న శ్లోకములవలన తెలియుచున్నది.

కాగా అర్చనలో తులసీదళము లెట్లు అయోగ్యము లగునో కూడ పురాణములందు వివరింపబడినది.

శ్లో॥ అస్నాత్వా తులసీం ఛిత్వా - దేవతా పితృకర్మణి
తత్సర్వం నిష్ఫలం యాతి - పంచగవ్యేన శుద్ధ్యతి॥

అని చెప్పబడుటవలన స్నానము చేయకుండ కోయబడిన తులసీదళము దేవకార్యములకు కాని, పితృ కార్యమునకు కాని ఎట్టివానికి పనికిరాదు. ఈ నియమ మన్నివిధములగు పత్ర పుష్పములకు వర్తించును. అట్లు చెప్పినంత మాత్రమున స్నానానంతరమే మధ్యాహ్న సమయమందు వానిని కోయుట నిషేధింపబడినది.

శ్లో॥ స్నానం కృత్వా తుయే కేచిత్ - పుష్పం చిన్వన్తి మానవాః
దేవతా స్త న్నగృహ్ణన్తి - భస్మీ భవతి కాష్ఠవత్॥

స్నానముచేసి ఎవ్వరైతే పుష్పాదులను కోయుదురో అట్టివానిని కాల్చబడిన కఱ్ఱవంటి వానినిగా దేవతలు స్వీకరించరు. అనగా ఇచ్చట స్నానము భోజనమునకు పూర్వముగ మధ్యాహ్న సమయమున చేయు స్నానము. ఆవేళకు పుష్పపత్రములు వాడియుండును. అప్పుడు కోయదగదు.

అందుననే పెద్దలు సూర్యోదయమున స్నానము చేసినప్పుడు కాని, లేదా కాలకృత్యములొనర్చిన వెంటనే విభూది ధరించి అట్లు విభూది స్నానమొనర్చి కాని పుష్పపత్రాదులను దేవతార్చనకై కోయుదురు. ఇట్లే

'కరానీతం పటానీతం తత్పుష్పం సకలం త్యజేత్, అనియు

శ్లో॥ దైవోపరి ధృతం యచ్చ - వామహస్తే చ య ద్ధృతం
అధోవస్త్ర ధృతం - తత్పుష్పం పరివర్జయేత్॥

అనియు చెప్పబడుటవలన ఎడమచేతితో తెచ్చిన పత్రపుష్పాదులు, కట్టుకున్న వస్త్రమున కోసుకొనివచ్చినవి దైవ కార్యమునకు పనికిరావని, కావున తులసియు ఆరీతిగా తీసికొని రావగదనియు తెలియదగును. అందుననే పెద్దలు శాస్త్రార్థము ఒక్క ఆకయిన చేతియందుంచుకొని పూవులను వానియందుంచుదురు. ఆయా ద్రవ్యములు ధరించు విషయమున గూడ విధి నిషేధములు కానవచ్చు చున్నవి. కర్ణే పుష్పంగళే గంధః - శిఖాయాం

తులసీదళం వంటి పెద్దల వాక్యముల వలన బ్రాహ్మణుడగు వాడు చెవిలో పూవు, కంఠమున గంధము, జుట్టు ముడియందు తులసీ దళమును ధరించరాదని తెలియుచున్నది.

కొన్నికొన్ని పత్రములతో కొందరు దేవతల నర్చింప దగదనియు నిషేధము కానవచ్చుటచే తులసి విషయమున గూడ దాని నెఱింగి పాటింపదగును. కార్తీక మాహాత్మ్యమున

శ్లో॥ గణేశం తులసీ పత్రైః - దుర్గాం నైవ తు దూర్వయా
మునిపుష్పైస్తు సూర్యం చ - లక్ష్మీకామో న చార్చయేత్॥

అనియు: పద్మ పురాణమున

శ్లో॥ న బిల్వై నార్చయే ద్భానుం - నకేతక్యా మహేశ్వరం
నాక్షతైః పూజయే ద్విష్ణుం - న తులస్యా గణేశ్వరమ్॥

అనియు; స్మృతి రత్నాకరమున

శ్లో॥ నాక్షతై రర్చయే ద్విష్ణుం - న శంభుం శంఖవారిణా
నార్చయే ద్దూర్వయా దుర్గాం - న తులస్యా సురాంతరమ్

అనియు చెప్పబడినది. పై శ్లోకములవలన తులసీ పత్రములతో వినాయకుని, గరికచే దుర్గాదేవిని, మారేడు దళములతో సూర్యుని, మొగలిచే పరమేశ్వరుని, అక్షతలచే విష్ణుమూర్తిని పూజింప రాదని తెలియుచున్నది. కాని వినాయక చవితినాడు అర్చనకుపయోగింపదగు ఇరువది యొక్క విధముల పత్రములందు తులసీ చెప్పబడుటవలన పై నిషేధమా ఒక్కరోజున వర్తింపదని తెలియును.

శ్లో॥ గంగాం చ తులసీం చైవ - సర్వకాలేషు సంస్మరేత్
దుస్స్వప్నే దుర్నిమిత్తే చ దుష్టభావే సుఖీ భవేత్

గంగను, తులసిని ఎల్లప్పుడు స్మరింపవలెను. అట్టిసర్మణ వలన దుస్స్వప్నము. దుష్ట భావములను పొందక వానివలనికష్ట మందక సుఖము పొందగలడు.

శ్లో॥ పాపాని యాని రవిసూను పరార్పకాని
బ్రాహ్మఘ్న బాల పితృ మాతృ వధాది కాని
నశ్యంతి తాని తులసీవన దర్శనేన
గోకోటి దానసదృశం ఫల మాప్నుతే చ॥

అనిచెప్పుటచే యమసదనమున కేగుటకు కారణములైన బ్రహ్మ బాల పితృ మాతృ హత్యల దోషములు తులసీవన దర్శనమువలన తొలగును. అట్లే తులసీవన దర్శనమువలన కోటిగోదాన ఫలమబ్బును అని తెలియుచున్నది.

శ్లో॥ యో గోపీ చందనా భావే - తులసీమూల మృత్తికాం
ముముక్షు ర్ధారయే ధీమాన్ - అపరోక్షార్థ సిద్ధయే॥

శ్లో॥ తులస్యాః పరమే మూలే - మృత్తికా పాపనాశనీ
యస్య ఫాలే స్థితా నిత్యం - తస్య ముక్తిర్న సంశయః

అనుటను బట్టి తులసి చెట్టు మూలమున నున్న మట్టిని ముఖమున ధరించుట చాల మంచిదని. గోపిచందనములేనిదోషము నది తీర్చునని, ముక్తి కారణమని, పాపనాశనియని తెలియుచు

న్నది. అందువలనే పెద్దలు కొన్ని అశౌచముల శుద్ధియందు తులసి మట్టి నుపయోగింతురు. కేశచ్ఛేదము జరుపు కొనిన పిదప చేయు స్నానమున తులసి మట్టిని వాడుదురు. తులసిని సంతాన ప్రదగా చెప్పెదరు. ఉదయమున కీవిషయము నుపదేశించుచూ వశిష్ఠుడు నిత్యం షోడశోప చారములతో తులసీపూజ, విష్ణ్వారాధనలను చేయాలని, తులసి తీర్థము త్రాగి దేహమునానీటితో తడుపుకోవలెనని చెప్పెను. అంతియు కాక అందుకై ఒకనియమ మున్నది. వ్యస్థురాలగు స్త్రీ ఋతుస్నాన పూర్వదినమున చక్రకేళికదళీ ఫలమును చీల్చి దానిని పెదురు వప్పుతో కట్టి దానిని తులసీ వనమున తులసిచెట్టుక్రింద రాత్రి అంతా యుంచి ఉదయమున ఋతుస్నానాంతరముదానిని తిని పాలుత్రాగవలెను. తులసీ వనమున తయారగు కదళీఫలము సంతానకారిగాచెప్పబడుచున్నది

ఆది, గురువారములందు తీసిన తులసి వేరుధరిస్తే పిల్లకాక దోషము, పక్షిపారుడు దోషము, ముట్టు దోషముతొలగును వరుసజ్వరములందు ఆది,గురువారములందు చెట్టు తిరుగవేయుదురు. మకర సంక్రమణము నాడు తీసిన తులసి బదనిక దగ్గఱ నున్నచో అధికారవశ్యము చెప్పబడినది. ఇంకను సమయ నియమము లిట్లుకానవచ్చుచున్నవి.

శ్లో॥ ప్రభాతే తులసీపత్రం - ఛేదయే ద్య స్స పై పుమాన్
యమలోకం న కుశ్యే ది - సగచ్ఛే త్పరమం పదమ్॥

"ప్రభాత సమయమున నెవఁడు తులసీ పత్రమును కోయునో వాఁడు యమలోకం చూడఁడు" అని సామాన్య నియముతోడనే

శ్లో॥ అకాలే తులసీపత్రం - ఛేదయే ద్య స్స్నపై పుమాన్
పత్రా దేకా ద్బ్రహ్మహత్యా - సో஽వశ్యం నరకం వ్రజేత్॥

అకాలమునందు తులసీ పత్రము నెవఁడు ఛేదించునో అట్టి ఒక్క ఆకును తుంచుట వలననే బ్రహ్మహత్యా దోషముకల్గి వాఁడు తప్పక నరకమునకుపోవును అను విశేషనియమముకూడచెప్పబడుచున్నది. విశేషములనెఱుఁగక ఏదో సామాన్య వాక్యమున తృప్తిపడి ఆచరించు వారు ఫలమునందక పోగా ప్రమాదపడియెదరు. కావున ప్రతి ధార్మిక పూజావిషయమునందును సామాన్య నియమములతో బాటు విశేషనియమములను అవశ్యము తెలిసికొనఁదగును.

శ్లో॥ శుక్రవారే వ్యతీపాతే - ద్వాదశాం శ్రవణే తథా
నిత్యార్చనా తత్పరో஽పి - తులసీం న హరే ద్బుధః॥

'శుక్రవారమునను, వ్యతీపాతయోగమునను, ద్వాదశియందును, శ్రవణా నక్షత్రమందును నిత్యార్చనాతత్పరుఁడు కూడ తులసినికోయరాదు."

శ్లో॥ సంక్రాత్యాం పక్షయో రంతే - ద్వాదశ్యాం నిశి సంధ్యయోః
తులసీం యే వినాశ్యంతి - తే కృతంతి హరేశ్శిరః॥

సంక్రమణ సమయమందును, అమావాస్య,పౌర్ణముల యందును, ద్వాదశి యందును, రాత్రియందును,సంధ్యా సమయములందును తులసినెవ్వరు కోయుదురో వారు విష్ణు శిరస్సునుఁ ద్రుంచ యత్నించినట్లేయగును.

శ్లో॥ సంక్రాంతిః పక్షయో రంత - గురువార శ్చ గర్హితాః
భానౌ భౌమే భృగౌ చాపి - తులసీం తు వివర్జయేత్॥

'సంక్రమణ సమయము, అమవసీ పౌర్ణములు గురు వారము తులసిని త్రుంచుటలో పూర్తిగా పనికి రానివి. ఆది,మంగళవారములుకూడ తులసి చ్ఛేదము మానుటమంచిది.

బ్రహ్మ వైవర్త పురాణమునందీ విధినిషేధము లిట్లు కానవచ్చు చున్నవి.

శ్లో॥ పూర్ణిమాయాం అమాయాం చ ద్వాదశ్యాం రవిసంక్రమే
తైలాభ్యంగేన స్నాతేన మధ్యాహ్నే నిశి సంధ్యయోః॥

శ్లో॥ అశౌచేఽ శుచిలే చ - రాత్రౌ వాసాన్వితేఽపి వా
తులసీం యే చ చిన్వంతి - తే ఛిందంతి హరే శ్శిరః॥

!పౌర్ణిమ' అమావాస్య, ద్వాదశి, సంక్రాంతి రోజులందు అభ్యంగస్నానము నాడు, మధ్యాహ్నమున; రాత్రి యందు, సంధ్యా సమయములందు: అశుచి యున్నప్పుడు జాతాశౌచమృతాశౌచము నందినకాలము నందు, రాత్రివేళ వస్త్రములు ధరించి యున్నప్పుడు తులసిని ఎవరు త్రుంచెదరో వారు శ్రీమహావిష్ణువు యొక్క శిరస్సును త్రుంచినట్లే యగును. తులసిదళములు త్రుం

శుటలో నిషేధమున్నటులే తులసిని త్రుంచెడు పద్ధతిగా ఒకనియ
మమున్నది. తులసిని త్రుంచునప్పుడు

శ్లో॥ మాత స్తులసి గోవింద - హృదయానందతరిణి!
నారాయణస్య పూజార్థం చినోమి త్వాం నమోస్తు తే॥

అను శ్లోకమును మూడు సార్లు పఠింపనగును.

"ఓతులసి తల్లీ! శ్రీకృష్ణుని హృదయానందమునకు కారణ
మైనదాన! నారాయణుని పూజకొఱకే నిన్ను త్రుంచుచున్నాను.
నీకు నమస్కారము" అనిదీనిభావము. ముమ్మారు దీనిని పఠించి
కరతాళ ధ్వనిచేయుచు తులసీ దళములను మాత్రమే త్రుంచ-
వలెను. అవసర మగునంతవరకే త్రుంచుచు ఇతరములగు ఆకులు
కొమ్మలు త్రుంచకుండ చూచి చివరకు నమస్కరించవలెను.

నియమమెఱిఁగి పాటించినవన్నియు సత్ఫలితము
నిచ్చును. నియమ రహితముగ పర్తించి ఫలము లభింపమికి
దైవమును, మహనీయుల వాక్యములను నిందించుట వ్యర్థము
విధినియమములెఱిఁగివర్తించుట కర్తవ్యము!

# తులసీ మాహాత్మ్యము

శ్రీతులసి మహాత్మ్యమును అన్ని పురాణములు వేనోళ్ళ పొగడుచున్నవి. వేదమునందర్థవాదల వలె నాయా ప్రవచనవిధానమునందు కొంతఅతిశయోక్తి తోచినను అన్నిపురాణాంశము లంతగా చెప్పుట దాని విశిష్టతను చాటుచున్నది.

'పీయూషజాహి తులసీ - దేవదేవన మస్కృతా' అని పద్మ పురాణమున నుతింపబడినది. తులసి అమృతమునుండి పుట్టినద నుచు పురాణములిట్లు చెప్పుచున్నవి. దేవ దానవులు పాలసముద్రమును మథించిన పిమ్మటఅమృతముపుట్టెను. మధుసూదనుఁడా అమృతమునుచూచి పరమానందమందగానాతని ఆనందబాష్పము లందు బడి తులసి మొక్క పుట్టెను. విష్ణువు అప్పుడు పుట్టిన లక్ష్మీ కౌస్తుభములను హృదయమున దాల్చి తులసిని ఆపాదమస్తకము ధరించెను.

మాఘమాహాత్మ్యమున నీరీతిగా చెప్పబడినది. తులసి సమస్త దోషములను పోగొట్టికోర్కెలుతీర్చునట్టిది. తులసి,తామరలు పలువురు వైష్ణవులు ఎచ్చటనుందురో అచ్చట విష్ణుమూర్తి సంతస మున నుండును. తులసి మొక్క వేయుట వలన యమకూప యాతన లుండవు. సత్పురుషుడగువాని యింట తులసియుండును అట్టితావునకు యమదూతలు పోరు. తులసి పుణ్యతీర్థముతో సమానము. తులసి నాటిన ప్రదేశము, తులసివిత్తనములు, దళ

ములు ఎంతదూరము వ్యాపించి యుండునో అందంతట హరిసన్ని హితుఁడు, తులసిని వాసన చూచువారి పితరులు విష్ణులోకమున నిలతురు నర్మదా దర్శనము, గంగా జలస్నానము, తులసి దళ ధారణము సమములు. తులసినవేసి పెంచుటవలన, దానిని నీటితో తడుపుటవలన తులసి పరిమళం స్వీకరించుటవలనను సకల దోష ములు తొలగును. ప్రతి పక్షమునను బ్రహ్మేంద్రాదులు తులసిచే వి ష్ణువునకు పూజలొనర్తురు. తులసిచే పూజించుటవలనవచ్చు ఫలము బంగారు పుష్పరత్నములతో పూజించిననురాదు. ఒక్క తులసిని నాటుటచే వచ్చు ఫలము నూరావుల మేపుటచేతను, వేయి మామి డిచెట్లను పెంచుటచేతను వచ్చుఫలముతోసమానము. విష్ణుపూజకై తులసి వనము వేయువానికి అనంత ఫలమువచ్చును. శ్వేత తులసి దళములతో హరిహరుల నర్చించువారికి యమబాధలుండవు. గం గాది తీర్థములు, విష్ణ్వాది దేవతలును తులసియందు నివసించి యుందురు. తులసినాటి వానిదళములతో నెవ్వరు హరిపూజచేయు దురో వారు వైకుంఠమున నుందురు" అని.

అట్లే వైశాఖ మాహాత్మ్యమున హరి పూజాద్రవ్యములందు తులసి విశేషముగా చెప్పబడినది. సర్వతీర్థములు అందునిత్యసన్ని హితులై యుండునని, అందుచేసది పరమ పవిత్రమనియు చెప్ప బడినది.

కార్తికమాహాత్మ్యమునను తులసినిగూర్చి తెలియుదగు నంశములు పెక్కుకలవు.

శ్లో॥ సాలగ్రామార్చనం రాజి న్మూర్ధే మాసి ప్రయత్నతః
తులసీదళై రర్చయే ద్యః య స్సధన్యో న సంశయః

శ్లో॥ తులసీకాష్ఠ గంధంతు సాలగ్రామస్య యోఽర్చయేత్
సర్వపాప వినిర్ముక్తః యాతి విష్ణోః పరం పదమ్॥

అని చెప్పబడినది. అనగా కార్తీక మాసంలో సాలగ్రామములకర్చన చేయువారు ధన్యులు. తులసీకాష్ఠము యొక్క గంధమును సాలగ్రామమునకు సమర్పించునారు పాపములు తొలగి విష్ణు సన్నిధానమందుదురు అని అట్లే స్త్రీలనుగూర్చి

శ్లో॥ బృందావనాగ్రే కార్తిక్యాం - గోమయే నోపలిప్య చ
స్వస్తికై శ్శంఖ పద్మాద్యై ర్యా కుర్యా త్సా హరేః ప్రియ
స్త్రియో మాల్యేన వా విష్ణుం పూజయే త్తులసీదళైః
తా స్సర్వవపాత న్ముక్తాః యాన్తి విష్ణోః పరంపాదమ్

అని చెప్పబడింది. ఏ స్త్రీ కార్తీక మాసమున తులసీ వనము ముందర ఆవు పేడతో సలికి స్వస్తికము, శంఖము, పద్మము మున్నగు మాగ్గులు పెట్టునో ఆస్త్రీ విష్ణువునకు ఇషురాలగును. కార్తీకమాసమున తులసిమాలలతో కాని తులసిదళములతోకని విష్ణువునర్చించిన స్త్రీలు సర్వపాపమాలనుండి తొలగి విష్ణుసన్నిదానమును చేరెదరు అని దాని యర్థముతులసి పూసలను మెడలోధరించి హరి నర్చించవలెను. ఎవరింట తులసి, హరికాధాగానము, భగవద్గీతా పాఠము ఉండునో అట్టివారు యమలోకమునకు పోరు. కార్తీక శుద్ధ ద్వాదశి నాడు సాలగ్రామార్చన మొ

నర్చి శ్రోత్రియుండగు గృహస్తునకు సువర్ణ తులసిని దానమిచ్చు
వారికి చతుస్సముద్ర పర్యంత భూదానఫలము లభించుననిచెప్ప
బడినది.

తులసి అర్చన యందు కార్తిక మాసము చాలముఖ్య
మైనది. ఆమాసమున శుద్ధ ఏకాదశీ క్షీరాబ్ధి ఏకాదశిగా ప్రశస్తమై
నది. ఆమరుసటిదినమున తులసి పూజచేయుట అనంత ఫలము
నిచ్చును. పార్వతీదేవి ప్రసాదించిన విత్తనములచె నుద్భవించిన
తులసిని శారదాంబ ప్రసాదించిన విత్తనములచే నావిర్భ వించిన
పెద్ద ఉసిరికను దామోదరుడు ఆకార్తిక శుద్దద్వాదశినాడు పరిణయ
మాడుటవలన ఆదినమున తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీనారా
యణ స్వామిని పూజించువారికి అమితమగు పుణ్యముకల్గును
ప్రతి ద్వాదశి యందును తులసీవన మధ్యమున విష్ణుసహస్రనామ
పఠనము గావించువారు బహు పుణ్యవంతులై అన్నదానము నం
దుదురు. కార్తిక శుద్ధ ద్వాదశినాడొనర్చు వ్రతమును మథన
ద్వాదశి వ్రతమందురు. సర్వపాప విముక్తికి, సర్వశుభప్రాప్తికి
ఈవ్రతమువిశేషించి చెప్పబడినది. దీనినేచిలుకు ద్వాదశి యనికూడ
అందురు. ఆనాడు క్షీరాబ్ధి శయనవ్రతమును నిర్వహింతురు తుల
సివిషయమున నాడు జరుపు ముఖ్యమైన పుణ్యవ్రతమే మథన
ద్వాదశీ వ్రతము.

---

# మథనద్వాదశీ వ్రతకల్పము

పూజాద్రవ్యములను, తులసిని లక్ష్మీనారాయణ ప్రతిమాదులను సిద్ధముచేసి ముందుగ దీపారాదన మొనర్చి ఆచనమయిన పిమ్మట సంకల్ప మొనర్చుకొని పూజాకార్యక్రమముగావింపవలెను

శ్లో॥ తులస్యమృతజన్మాసి - సదా త్వం కేశవప్రియేః
కేశవార్చన యోగ్యే మే - వరదా భవ సర్వదా॥

శ్రీ తులస్యైనమః ధ్యాయామి సమర్పయామి,

శ్లో॥ కృష్ణానందా శ్రు సంభూతే - వరదే! తులసి! స్వయం
త్వా మ ద్యావాహయా మ్యాద్యే : కమలాపతి వల్లభే!॥

శ్రీ తులస్యైనమః ఆవాహయామి; ద్యానం ఆవాహనం సమర్పయామి.

శ్లో॥ అనేకహార సంయుక్తం - సువర్ణమణి సంయుతం
రత్నసింహాసనం దివ్యం - ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్॥

శ్రీతులస్యైనమః నవరత్నఖచితస్వర్ణసింహాసనంసమర్పయామి
దేవి! స్థిరాభవ, వరదాభవ, సుఖీభవ, సుప్రసన్నా భవ; స్థిరాసనం కురు.

శ్లో॥ పద్మనాభప్రియే దేవి! - పాద్యమే తన్మయార్పితం
సంగృహాణ శుభే శ్యామే - వరదే! లోకపావని!॥

శ్రీ తులసై నమః పాదయోః పద్యం సమర్పయామి.

శ్లో॥ క్షీరోదధి సముత్పన్నే - దేవాసుర సుపూజితే
విష్ణుప్రియే మయా - దత్తంగృహాణార్ఘ్యం నమోస్తు తే

శ్రీ తులస్యైనమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి

శ్లో॥ ఏలా లవంగ కర్పూరం - చందనాద్యైః సువాసితం
పానీయం చ మయా నీతం, సమ్యగాచమనీయకమ్॥

శ్రీ తులస్యైనమః ముఖే ఆచమనీయం సమర్పయామి

శ్లో॥ క్షీరా జేక్షురసైః పుణ్యై - ర్దధ్నా చ మధునా తథా
పంచామృతై స్నాపయిష్యే - తులస్యై తే నమోనమః

శ్రీ తులస్యైనమః పంచామృత స్నానం సమర్పయామి

శ్లో॥ సుశీతలం సుప్రసన్నం - సర్వౌషధి సమన్వితం
మయాZ హృతం జలందేవి! స్నానం కురు హరిప్రియే!

శ్రీ తులస్యైనమః శుద్ధోదకస్నానం సమర్పయామి

శ్లో॥ ప్రీతవస్త్రయుగం దేవి! - సర్వాభీష్ట ప్రదాయిని!
సర్వలక్షణ సంపన్నే! శుభే! తే ప్రదదామ్యహమ్॥

శ్రీ తులస్యైనమః వస్త్రయుగ్మం సమర్పయామి

శ్లో। కంచుకం కాంచనం దివ్యం బ్రహ్మణా నిర్మితం పురా
అహం దాస్యామి దేవేశి! విష్ణుపత్ని! నమోZస్తు తే॥

శ్రీ తులస్యై నమః కంచుకాభరణం సమర్పయామి

శ్లో॥ స్వచ్ఛం నిర్మల మత్యర్థం - పురతస్తై కృతం శుభం
కంఠసూత్రం గృహాణ త్వం - దదామి [illegible]

శ్రీ తులస్యైనమః ఆభరణాని సమర్పయామి

శ్లో॥ చందనాగరు కర్పూర, మృగనాభి [illegible]
గంధం గృహాణ దేవేశి! దేవదేవాంగ [illegible]

శ్రీ తులస్యైనమః, దివ్యశ్రీ చందనం [illegible]

శ్లో॥ శాలీయా ంశ్చంద్రవర్ణాంశ్చ - హరిద్రామి శ్రితాన్ శుభాన్
అక్షతాం శ్చార్చయే తుభ్యం - గృహాణ శ్రీహరిప్రియే॥

శ్రీ తులస్యై నమః, అక్షతాన్ సమర్పయామి.

శ్లో॥ మయా దత్త మిదం పుష్పం - తులసీదళ సంయుతం
మాల్యం గృహాణ దేవేశి! వరదే! విష్ణువల్లభే!॥

శ్రీ తులస్యై నమః, పుష్పాణి సమర్పయామి.

## అథ అంగపూజా

తులస్యై నమః - పాదౌ పూజయామి.

విష్ణుప్రియాయై నమః - గుల్ఫౌ పూజయామి.

రంభోర్వై నమః ఊరూ పూజయామి.

క్షీరాబ్ధి తనయాయై నమః కటిం పూజయామి.

సకల సురపూజ్యై నమః - నాభిం పూజయామి.

ఇందిరాయైనమః - ఉదరం పూజయామి.

బృందావన వాసిన్యై నమః - వక్షఃపూజయామి:

మహాలక్ష్మైనమః - స్తనౌ పూజయామి:

సుభుజాయై నమః - భుజే పూజయామి:

పద్మహస్తాయైనమః - హస్తౌ పూజయామి:

సుముఖాయైనమః - ముఖం పూజయామి.

రమాయై నమః - లలాటం పూజయామి:

ఇందుసోదర్యై నమః - శిరః పూజయామి:

శ్రీ తులస్యై నమః సర్వాణ్యంగాని పూజయామి॥

విష్ణుపూజాం కృత్వా శ్రీ మహావిష్ణుం పుష్పై రర్చయేత్.

శ్లో॥ చందనాగరు కర్పూర - ఘృత గుగ్గుల సంయుతం
గృహాణ ధూపం తులసీ - వందేఽహం భక్తవత్సలే!॥

శ్రీ తులస్యై నమః ధూప మాఘ్రాపయామి.

శ్లో॥ ఘృతవర్తిఘు దీప్తం తే - మయాఽర్పితే మిదం శుభే
గృహాణ మంగళం దీపం - సర్వైశ్వర్య ప్రదాయిని!॥

శ్రీ తులస్యై నమః దీపం దర్శయామి.

శ్లో॥ క్షీరం చ గుడసంయుక్తం - సర్పిషాయుత మాదరాత్
మయాని వేదితం భుంక్ష్వ - పంచభక్ష్య సమన్వితమ్॥

శ్రీ తులస్యై నమః నైవేద్యం సమర్పయామి.

శ్లో॥ పూగీఫలై శ్చ కర్పూరై - ర్నాగవల్లీ దళై ర్యుతం
తాంబూలం గృహ్యతాం దేవి! వరదేభవ శోభనే!॥

శ్రీ తులస్యై నమః తాంబూలం సమర్పయామి.

శ్లో॥ వ్రత పూర్తిం మహాకీర్తిం - దివ్యస్ఫూర్తిం హరిప్రియే!
ప్రాప్తకామ ఇదందేవి! సౌవర్ణం పుష్ప మర్పయేత్॥

శ్రీ తులస్యై నమః సువర్ణపుష్పం సమర్పయామి.

శ్లో॥ పద్మనాభప్రియే! నిత్యం - పద్మ సంభవపూజితే!
పద్మ పత్ర విశాలాక్షి! వరదా భవ మే సదా॥

శ్రీ తులస్యై నమః నీరాజనం సమర్పయామి.

శ్లో॥ సర్వమంగళమాంగళ్యే - శివే సర్వార్థ సాధికే
శరణ్యే! త్ర్యంబకే దేవి! నారాయణి! నమోస్తుతే

శ్రీ తులస్యై నమః మంత్రపుష్పం సమర్పయామి.

శ్లో॥ నమస్కరోమి దేవి! త్వాం - విష్ణువక్షస్థలే స్థితాం
ప్రణతార్తి హరే నిత్యం - అభీష్టఫలదా భవ॥

శ్రీ తులస్యై నమః, నమస్కారం సమర్పయామి.

ఇతి పూజావిధానం సంపూర్ణమ్

# కథా ప్రారంభః-

శ్రీ కృష్ణ ఉవాచ:-

శ్లో॥ నారదాశేషసర్వజ్ఞః - లోకానాం హితకారణ!
కథయస్వ మహాభాగః - వ్రతం దేవర్షిసత్తమ॥

నారద ఉవాచ:-

శ్లో॥ వ్రతానా ముత్తమం పుణ్యం - సర్వసౌభాగ్య కారణం
సర్వసంపత్కరం శీఘ్రం - పుత్రపౌత్రా ప్రవర్ధనమ్॥
ఇషే మాసి సితే పక్షే - హ్యేకాదశ్యా ముపోషితః
తులసీం చ మహావిష్ణుం - పూజయిత్వా సమాహితః॥
పంచ పద్మా న్యలంకృత్యా - పంచదీపాన్ ప్రకల్పయేత్
గంధా ద్యక్షతనై వేద్యం - తాంబూలాని సమర్పయేత్॥
ప్రదక్షిణ నమస్కారాన్ - పంచ పంచ ప్రకల్పయేత్
తదాది మాసపర్యంత మాసవర్యతం- ప్రత్యహం చసమాచరేత్॥
ఊర్జే మాసి సితే పక్షే - హ్యేకాదశ్యాముపోషణః
పూర్వ వ త్తులసీ పూజాం - కృత్వానియమ పూర్వకమ్;।
రాత్రౌ జాగరణం కృత్వా - అథశ్నాయీ జితేంద్రియః
తతః ప్రభాతవేళాయాం - స్నాత్వశుచి రలంకృతః॥
కుడపేన తు పిష్టేన - కారయేత్పిష్టకత్రయం
ఏకం తులస్యైదత్వాతు - బ్రిహ్మణా య్యేక మ్మేంచ॥
ఉలూఖలేzనన్య త్స్రం స్థాప్య - చేక్షుమూలేనఘట్టయేత్

నారాయణ ఉవాచ:-

ఆయుర్హీనం సుతం వాపి - సుతాం వా మృతభర్తృకాం
తయో రేకం వృణీ ష్వాథ - దదామి తవ సువ్రత॥

దేవదత్త ఉవాచ:-

స్వ గృహం ప్రాప్య భార్యాయాః - ఏతాం వార్తాం నివేద్యచ
ఉభయో రేక మిచ్ఛామి - హ్యాగమిష్యామి కేశవః॥
ఇతి ప్రణమ్య శిరసా - జగామ స్వగృహం ప్రతి
నివేద్య సమ్య గ్భార్యాయై - బహుధా ऽలోచ్య చింతితా॥

భార్యోవాచ:-

సుతా హి యాచ్యా భోః స్వామిన్ - భర్తృహీనా ऽపి చత్వయా
తథేత్యుక్త్వా స విప్రేంద్రః - పున స్తీరం ప్రవిశ్యచ॥
నారాయణ నమస్తే ऽస్తు - పుత్రికాం దాతు మర్హసి
త థేత్యుక్త్వా మహావిష్ణు - రంతర్ధానం యయౌ తదా॥
అదృష్ట్వా తం మహావిప్రః పశ్చా త్స్వ గృహ మాగతః
కించిత్కాలే వ్యతీతే తు - పుత్రీ జాతాస్య వై శుభా॥
సర్వలక్షణ సంపన్నా - సర్వరోగ వివర్జితా
పితుర్గృహేతు సా కన్యా - వర్ధితా చ సురూపిణీ॥
తతః కాలే తు సంప్రాప్తే - వివాహ మకరోత్పితా
జన్మాంతర కృతాత్పాపా - త్సా జాతా మృతభర్తృకా॥
జననీ జనకౌ తస్యా స్తత స్స్వర్గ మవాపతుః
తద్గృహే విధవా సా ऽపి - సర్వధర్మ వివర్జితా॥

నాస్తి నారాయణే త్యుక్తిం - వదన్తి మృతభర్తృకా
అతిథిం నార్చయ త్యేవం - కదాపి స్వగృహాగతమ్॥
ఏవం కఠిన చిత్తా సా - స్థితా నిష్ఠురభాషిణీ
శశ్వ దుచ్చార్య తే సాధు - మన్నా మాధవయా తయా
ఇతి తుష్టో హృషీకేశో - ద్విజో భూత్వా సమాహితః
తా మయాచత విష్ణు శ్చ - తద్వచ స్వాऽబ్రవీ త్పునః॥
కాలోపపన్నా నతిథీన్ - కిమర్థ మవమన్యసే
ఇతి బ్రువాణం తం విష్ణుం - రుషా లేపాంశుకం దదౌ॥
తన్మధ్యే చాఢకం బీజం - దృష్ట్వా హరి రవాపయత్
మృతా కాలేన సా కీటో - భూత్వా తత్పర్ణభుక్ స్థితా॥
తతః కదాచి త్తాం స్మృత్వా - దేవీం హరి రువాచ హ
ద్రష్టుం యా స్యామి హే దేవి! - ఏహి నారాయణాభిధామ్॥
ఇ త్యుక్త్వాథ గతే విష్ణౌ - జవేన రమయాసహ
ఆగత్య కిం సుఖద్రిం తే - హరి రి త్యన్వయుంక్త తామ్॥
కీటక ఉవాచ:-
ఏవం తిష్ఠా మ్యహం దేవ! ప్రసీద జగదీశ్వర!
ఇతి ప్రణమ్య శిరసా - కీట స్తూష్ణీం స్థిత స్తదా॥
దేవ్యువాచ:-
కిమర్థ మేషా కీటో ऽభవ - ద్దేవదేవ వదస్వ మే
ఇతిపృష్ట స్తయా విష్ణుః - తద్వృత్తాంత మవోచత॥

త చ్ఛ్రుత్వా కమలా దేవి - తన్మోక్షం చాప్యపృచ్ఛత॥

శ్రీ భగవానువాచ:-

ఊర్జే మాసి సితే పక్షే - ద్వాదశ్యా మస్తి యద్వ్రతం
తద్వ్రతస్య ఫలం కించి - ద్దాతు మర్హసి శోభనే!॥
ఇక్షుబిందు ఫలేనైవ - ముచ్యతే పాపబంధనాత్
తథేతి శ్రీర్దదౌ తస్యై - కీటోఽపి స్త్రీత్వ మావహత్॥

స్త్రీ ప్రాహ:-

అద్య మే సఫలం జన్మ - జీవితం చ సుజీవితం
వ్రతాని సఫలా న్యద్య - భవ త్పాదాబ్జదర్శనాత్॥
ఇతి స్తుత్వా ఽథ సా నారీ - శ్రియం ప్రాహ ముదాయుతా
అహ మేతద్వ్రతం దేవి! కరిష్యామి వదస్వ మే॥

దేవ్యువాచ:-

కార్తికే చ సితే పక్షే - ఏకాదశ్యా ముపోష్య చ
తులసీం పూజయిత్వాఽథ - పంచవర్ణై శ్చ చూర్ణకైః॥
పంచపద్మై రలంకృత్వా - ధూపదీపాదిభిః క్రమాత్
రాత్రౌ జాగరణం కృత్వా - పురాణవఠనాదిభిః॥
తతః ప్రభాతవేళాయాం - స్నాత్వా ధృత్వాంబరం శుచి
తులసీం పూర్వవ త్పూజ్య - కృత్వా పై పిష్టకత్రయమ్॥
ఏకం తులస్యై ఏకం తు - బ్రాహ్మణాయ నివేదయేత్
అవశిష్టంతు యచ్చైకం - నిధా యోలూఖలే వయః॥

ప్రోక్ష్య క్షుమూర్తై ర్మారీ సా – హన్యా త్పుణ్యాంగనాన్వితా
కీర్తనీయా మహావిష్ణోః – కథా స్తల్లగ్న చేతసా॥
షడ్రసోపేత మన్నం చ – దద్యా ద్దక్షిణయా సహ
స్వయం చాపి హి భుంజీయా – దిష్టకామార్థ సిద్ధయే॥
ఏవం పంచాబ్ద పర్యంత – మాచరే త్సుసమాహితః
ఆదా వన్తే చ మధ్యేచ – కుర్యా దుద్యాపనం ముదా॥
కుర్యా ద్దైవ్ప్రతిమాం విష్ణు – ర్లక్ష్మ్యై శ్శక్త్యనుసారతః
గోమయే నానులి ప్యాథ – రంగవల్లీం ప్రకల్పయేత్॥
తన్మధ్యే పంచకుడపాన్ సంస్థాప్య శ్వేతతండులాన్
నిక్షిప్య ప్రతిమాయుగ్మం – తత్ర నారాయణం రమామ్॥
లక్ష్మీ నారాయణం దేవం – పూజయే ద్భక్తి పూర్వకం
అఖండితం నవం వస్త్రం – ఏకైకస్య పృ థక్ పృథక్॥
గంధ పుష్పాక్షతై ర్ధూపైః – దీపై ర్నైవేద్య సంయుతైః
నానావిధోపచారై శ్చ – పూజయిత్వా యథా విధి॥
ప్రదక్షిణం ప్రణామాం శ్చ – పంచ పంచక్రమేణతు
రాత్రౌ జాగరణం కుర్యాత్ – పురాణపఠనాదిభిః॥
తతః ప్రభాతవేళాయాం – నద్యాం స్నాత్వా సమాహితః
గృహమాగత్య మేధావీ – పునః పూజాం సమాచరేత్॥
ఏవం కృత్వా విధిజ్ఞాయ – ఆచార్యాయ కుటుంబినే
సుశీలాయ సుశాంతాయ – ప్రతిమాదాన మాచరేత్॥
సువాసినీద్వయం పంచ – దశబ్రాహ్మణ సత్తమాన్

కృత్వా తుష్టా న్భోజనాద్యైః వస్త్రాద్యై శ్చ విశేషతః॥
బ్రాహ్మణా న్భోజయే త్పశ్చాత్ – స్వయం భుంజీత బంధుభిః
ఏవం శక్త్యను సారేణ విత్తశాఠ్యం న కారయేత్॥
నోద్యాపయే ద్వ్రతం యస్తు పునః కీటో భవిష్యతి
ఏవ మాచరితం యైస్తు సర్వాభీష్ట ప్రదం వ్రతమ్॥
తేషాం భుక్తి శ్చ ముక్తి శ్చ భవ త్యత్ర న సంశయః
ఇత్యుక్త్వా ऽథ మహాలక్ష్మీః అంతర్ధానం యయౌ తదా॥
ఏవం క్రమేణ సా కన్యా కృత్వా వ్రత మనుత్తమం
ఇహ భుక్త్వాऽధికసుఖం శృణ్వంతి శ్రద్ధయా న్వితాః
తే సర్వే పాప నిర్ముక్తాః యాస్యన్తి పరమాంగతిమ్॥
ఇతిభవిష్యోత్తర పురాణే మథన ద్వాదశీ వ్రతకథాసంపూర్ణం

పై వ్రతకథను పౌరాణికులచే కాని, పురోహితులచే కాని చెప్పించుకొనవలెను. లేకున్న తెనుఁగుననున్న కథనయినచెప్పు కొని కథాక్షతలు ధరించవలెను.

# కథా ప్రారంభము

సూతుండు శౌనకాది మహామునులతో నిట్లనియె. ఓముని శ్రేష్ఠులారా! ఇహపర సాధకమైన ఒక వ్రతమును చెప్పుచున్నాను వినవలసినది.

ఒకప్పుడు శ్రీకృష్ణుడు తన కడకు వచ్చిన నారదునితో నిట్లనియె. ఓ నారదమునీంద్రా! మీరు సర్వధర్మము సెఱింగిన వారు. సర్వలోకముల మేలును కాంక్షించువారు. కావున ఓ దేవర్షీ! ఒక చక్కని వ్రతమును చెప్పవలసినది.

అనగా నారదుఁ డిట్లనియె. ఓ శ్రీకృష్ణా! వ్రతములలో ఉత్తమము, పుణ్యప్రదము; సర్వ శుభములు సంపదలు చేకూర్చు నట్టిదియు, శీఘ్రముగా పుత్రపౌత్రాభి వృద్ధికల్గించు నట్టిదియగు వ్రతమున్నది. ఆశ్వయుజ మాసమున శుక్లపక్షమున ఏకాదశి నాఁడుపవాసముండి అనన్య మనస్కులై తులసిని, మహావిష్ణువును పూజింపవలెను. ఐదు పద్మముల నేర్పరచి ఐదు దీపములఁ బెట్టవల యును. గంధపుష్ప ధూపదీప నైవేద్య తాంబూలాదులన్నిటిని ప్రదక్షిణ నమస్కారములను ఐదైదు చొప్పున సమర్పింపవలెను. అది మొదలుగ ఇట్లు నెలరోజులు ఆచరింపవలెను.

కార్తికశుద్ధ ఏకాదశినాఁడుపవాసము సల్పి వెనుక చెప్పిన రీతిగా నియమ పూర్వకముగా తులసీపూజ నాచరించి రాత్రి జాగ రణ మొనర్చి నేలపైననే ఇంద్రియ నిగ్రహులై గడపవలెను. పిదప ద్వాదశి నాఁడుదయముననే కాలకృత్యము లొనర్చి స్నాన

మాచరించి శుభ్రముగా నలంకరించుకొని మానెడు బియ్యపు పిం డితో మూడు పిష్టకము లొనర్చవలెను. ఒకటి తులసికి సమర్పించి మఱొకటి బ్రాహ్మణునకిడి మూఁడవ దానిని రోటియందుంచి పాలు పోసి చెఱకు గడలతో దంచవలెను. అట్లుదంచునెడ నెన్ని క్షీరబిందువులు తనదేహమున పడునో వ్రతుడన్ని వేలసంవత్స రములు స్వర్గలోకమున సుఖించును.

అనగా శ్రీకృష్ణుడు 'ఓనారదా! పూర్వమిట్టి ఫలితము కోరు నెవరిచే ఈవ్రతమాచరింపఁబడినది? ఆవ్రతమాచరించుట వలన వారికే ఫలము లభించినది చెప్పవలసినది అనగా నార దుఁ డిట్లనియె.

ఓ మహానుభావ! పూర్వము గొప్ప తేజస్సు కల్గిన వేద శాస్త్రార్థ తత్త్వజ్ఞుఁడగు దేవదత్తుఁడు అను పేరుగల బ్రాహ్మణుఁడు కలడుఆబ్రాహ్మణుఁడు తాను పుత్రసంతానము లేనివాఁడగుటవలన ముల్లోకములకు దైవమగు విష్ణుమూర్తిని ఆరాధించ నెంచి గొప్ప తపస్సు చేసెను. విష్ణుమూర్తి వృద్ధ బ్రాహ్మణుని రూపమున ప్రత్యక్షమై ఆవిధముగా తపస్సుచేయు బ్రాహ్మణునితో 'ఓబ్రాహ్మ ణుఁడా! నీవింత కఠినమైన తపస్సు నెందుకు ఆచరించు చుంటివో తెలుప వలసినది' అనగా బ్రాహ్మణుఁడు ఆమాటలు విని శ్రీవిష్ణు వునకు శిరసానమస్కరించి ఓదేవదేవా! జగన్నాథా! పురుషోత్తమ! నీపాద పద్మముల దర్శించుటవలననే నాజన్మము నేడు సఫల

మైనది. ఈఅదృష్టమే నాకోర్కెను కూడ తీర్చునసుటలో సందే హములేదు. నేను సంతానము లేనివాఁడను, దుఃఖితుఁడను అయి నిన్ను శరణువేడితిని. సర్వలోకములకు వరప్రదుఁడవగు నీవు నాకు పుత్రసంతానము ప్రసాదించవలసినది. అనఁగా నారాయ ణుండు 'ఓ బ్రాహ్మణుఁడా! అల్పాయువగు కుమారునయిన, భర్త చనిపోయెడి కుమార్తెనయిన ఎవరినో ఒకరిని కోరుకొనుము ఇచ్చెదను. అనిన బ్రాహ్మణుఁడు 'ఓ కేశవ!నాయింటికేగి నాభార్యకీ వృత్తాంతమంతయు తెల్పివచ్చి వారిర్వురిలో కొకరినొకరు కొందును' అని శ్రీ విష్ణువునకు నమస్కరించి తనఇంటికేగెను. అచ్చట భార్యతో ఆవిషయము పూర్తిగా ఆలోచించెను. భార్య నాథా!భర్తృ హీనఅయిననను కుమార్తెనే కోరవలసినది. అనగావల్లె యని మరల శ్రీహరియున్న తావునకు వచ్చెను. వచ్చి !ఓ నారా యణప్రభూ! నీకు నమస్కారము. నాకుకుమార్తెనే ప్రసాదింపుము అనగా విష్ణువు 'తథాస్తు' అని అంతర్ధానమందెను. బ్రాహ్మణుఁడు ఆరీతిగా వరమంది ఇంటికివచ్చెను.

ఇట్లు కొంతకాలము గడచినంత వానికి ఒక చక్కని కుమార్తె పుట్టెను. సర్వలక్షణ సంపన్నయు, ఎట్టి రోగములు లేనట్టి దై సౌందర్యవతియగు ఆబాలిక తండ్రి యింట పెరిగెను. అట్లు కొంతకాలమయిన పిమ్మట తండ్రి ఆమెకు వివాహము చేసెను. పూర్వజన్మ కృతమగు పాపకారణమున ఆమెభర్త మరణించి విధవ అయ్యెను. ఇట్లుండ కొంతకాలమునకామె తల్లిదండ్రులు కూడ మరణించిరి. ఆయింట ఆవిధవ ధర్మములన్నిటిని వీడి సంచరింప

జొచ్చెను. తనయింటికి వచ్చు అతిథులతో నారాయణుఁడు "లేఁడు గిరాయణుఁడులేఁ''డనుచు వారికాతిథ్యమిచ్చుట కూడమానివైచెను ఇట్లు ఆమె రతిసురా [illegible] భాషణములొనర్చుచుండెను. అంత విష్ణువు తనలో విధవయగు నీమె నాపేరు పలుమార్లు తలంచు చున్నది. విరోధమునకైనను నాపేరు తలంచుచున్నది. అనిసంత సించి బ్రాహ్మణరూపము ధరించినవాఁడై ఆనారాయణుఁడామెను యాచించగా ఆమె మామూలు గానే నారాయణుఁడు లేఁడనుచు నిందించెను, విష్ణువు 'ఓ కాంతా! నీవుఇంటికివచ్చు అతిథులనెం దుకు అవమానించుచున్నావు? అనగానే ఆమె కోపమువచ్చి తన చేతనున్న అలుకుగుడ్డ నీతని భిక్షాపాత్రలోనికి విసిరెను.

శ్రీవిష్ణువు ఆగుడ్డయందొక కందిగింజ యుండుటచూచి దానిని మొలపైచెను. పిదప కొంతకాలమున కావిధవ మరణించి కీటకముగా జన్మ ఎత్తి ఆకందియాకులనే తినుచుండెను. పిదప కొంతకాలమునకు ఆదేవదత్తుని కుమార్తెను గుర్తు చేసుకొని విష్ణుమూర్తి లక్ష్మితో ఆవిషయము చెప్పి కీటకరూపమున నున్న స్త్రీకడకు రమాదేవితో శ్రీవిష్ణువు వచ్చెను. వచ్చి ఆమెతో నీవు క్షేమముగా నున్నావా? అనిప్రశ్నించెను. అంత నాపూర్వవిధవ 'ఓదేవా; జగన్నాథా! నేనేదో ఈరీతిగా నున్నాను. న్నను గ్రహిం చవలసినది. అని నమస్కరించగా చూచి లక్ష్మిదేవి "నాథా! ఈమె ఏకారణముచేత ఈకీటక రూపముదాల్చెనో చెప్పవలసినది. అనగా

విష్ణుమూర్తి కారణమంతనువివరించ నాలక్ష్మీదేవి ఆకీటకజన్మనుండి ఆమెకు ముక్తి ఎట్లు లభించునో తెల్పవలసినదిగా కోరెను. అంత విష్ణువు ఓ లక్ష్మీ! కార్తీక శుద్ధ ద్వాదశి యందొక వ్రతముకలదు ఆవ్రతముయొక్క ఫలమును కొంత యిచ్చినచో ఈమె పురుగు జన్మనుండి విముక్తురాలగును. చెఱకురసముయొక్క బిందువుల ఫలముచే నీమె పాపబంధమునుండి బైటపడును. అనగా నట్లే లక్ష్మీదేవి ఆవ్రతమును ఆచరించిన ఫలమున కొంతభాగము నాకీటకమున నున్న స్త్రీకి ధారపోసెను. ఆపురుగు స్త్రీ రూపము పొంది ఇట్లనియె. "నేడు నాజన్మ సఫలమైనది. నాజీవితముమంచి జీవితమైనది. నాపూర్వజన్మల వ్రతము లేవైననున్న నవి ఈరోజే మీదర్శన భాగ్యము వలన సఫలమైనవి. అని మిక్కిలి సంతసించి లక్ష్మీదేవితో 'ఓ దేవీ! ఆవ్రతమెట్టిదో చెప్పుము. నేను అచరించుదును అనెను. అంత లక్ష్మీదేవి ఇట్లనియె.

కార్తీక మాసమున శుక్లపక్షమున ఏకాదశి యందుపవసించి ఐదురంగుల చూర్ణముల ముగ్గులతో అలంకరించి తులసీ దేవిని ధూప దీపాదులన్నింటితోను క్రమముగా పూజింపవలెను. రాత్రి జాగరణ మొనర్చి పురాణ పఠనాదులచ్చే గడుపవలెను. ఉదయముననే స్నానముచేసి శుచియగు నిష్టములగు వస్త్రములను ధరించి అంతకు క్రితము పూజించిన రీతిగా తులసిని పూజించి మూఁడు పిండిముద్దలను చేయవలెను. ఒకటి తులసీదేవికి, ఒకటి

బ్రాహ్మణునకును నివేదన చేయవలెను. మిగిలిన ఒక్కదానిని రోటిలోవేసి అందుపాలుపోసి చెఱకు గడలతో వ్రతముచేయునామె ముత్తైదువులతో గూడి దంచవలెను. అట్లే తదేకధ్యానమున శ్రీ మహావిష్ణువు గాథలను కీర్తించవలెను. పిదప బ్రాహ్మణ సువాసినులకు షడ్రసోపేతమగు అన్నమును సమారాధనముచేసి దక్షిణ సమర్పించ వలయును. పిదప తానును భుజించ వలెను. ఈరీతిగా ఇష్టకామ్యార్థ సిద్ధికై నిశ్చల బుద్ధితో ఐదేండ్లీ వ్రతము నాచరింప వలెను. వ్రతాదియందు కాని, మధ్యకాని, అంతమందైనను సంతోషముతో నుద్యాపన మొనర్చవలెను.

ఉద్యాపన మెట్లన శక్త్యను సారముగా శ్రీమహావిష్ణువు యొక్క, లక్ష్మీదేవి యొక్కయు ప్రతిమలను తయారు చేయవలయును. చక్కని ప్రదేశమును ఆవుపేడతో నలికి ముగ్గులు పెట్టవలెను. దానిమధ్య నైదు మానికల తెల్లనిబియ్యము నుంచి వానియందు లక్ష్మీ నారాయణుల ప్రతిమలు రెంటినుంచి భక్తిపూర్వకముగా శ్రీమన్నారాయణుని పూజింప వలెను. లక్ష్మీ నారాయణుల్వారకు ప్రత్యేకముగా చినుగని క్రొత్త వస్త్రములను సమర్పింప వలెను గంధము, పుష్పము, అక్షతలు, ధూపదీప నైవేద్యముంనుపరుడిన నానావిధోపచారములతో యథావిధి పూజించి ఐదైదు చొప్పున క్రమముగా ప్రదక్షిణ నమస్కారములను కూడ ఆచరించవలెను. రాత్రి పురాణ పఠనాదులతో కాలక్షేపమొనర్చుచు జాగరణ మొనర్చవలెను.

పిదప తెల్లవారగనే నదియందుచక్కగా స్నానమొనర్చి ఇంటికివచ్చి పునఃపూజ నొనర్చవలెను. ఇట్లొనర్చి దైవజ్ఞుఁడు గురుతుల్యుఁడు, గృహస్థు, సచ్ఛీలము కలవాఁడు శాంతిగుణము కలవాడు నగు వానికి ఆప్రతిమలను దానమీయవలెను. ఇర్వైరు ముప్పైదువులను, పదునైదుగురు బ్రాహ్మణశ్రేష్ఠులనుషడ్రసోపేత మగు భోజనముచేతను, మంచివస్త్రములతోను,తృప్తిపరచి బ్రాహ్మ ణులను సమారాధన మయిన పిదప బంధువులతో తానును.

ఇట్లుధనలోపము చేయక యథాశక్తిగ నాచరించవలెను. ఎవరీ వ్రతమాచరించి యుద్యాపన మొనర్చురో వాడు కీటకజన్మ మెత్తుదురు. ఇట్టిసర్వాభీష్టప్రద వ్రతమాచరించువారికి ఇహమున భోగములును,పరమున మోక్షమును లభించును. ఇందు సందే హములేదు. అకచెప్పి రామహాలక్ష్మి అంతర్ధానమందెను.

ఈచెప్పిన క్రమమున ఆస్త్రీ శ్రేష్ఠమగు నీవ్రతము నాచరించి ఇహమున సమస్త సుఖముల ననుభవించి చివఱకు దేహాంతమున స్వర్గలోకమునకేగెను.

ఇట్టి పుణ్యప్రదమగు తులసీ వ్రతకథ నెవరు చదివెదరో లేదా శ్రద్ధతో ఎవరు విందురో వారందఱు పాపములనుండి తొ లగి ఉత్తమ గతిని పొందుదురు.

అనిభవిష్యోత్తర పురాణమందలి మథన ద్వాదశీవ్రతకథ సంపూర్ణము,

# మంగళ హారతి

శ్రీతులసీదేవికి శుభమంగళం
తులసి మాతల్లికి జయమంగళం
శ్రీవిష్ణుపత్నికి క్షేమప్రదాయినికి
స్త్రీ లోకనిత్యపూజ్యకు వంద్యకు
ఆరోగ్య భోగభాగ్యాలిచ్చికీర్తితో
పుత్ర పౌత్రాది సంపదలిచ్చుతల్లికి ॥శ్రీతులసి॥
ఇంటిముంగిట జేరి ఇలవేల్పుతానౌచు
ఎల్లవారల కోర్కెలీడేర్చి కడతేర్చి
పత్ర పుష్పాలతో సర్వోపచారముల
చుట్టుకొమ్మలు చేరిసేవించుతల్లికి ॥శ్రీతులసి॥
పసుపు కుంకుమలతో పూజించువారికి
జన్మ జన్మలయందు పసుపు కుంకుమనిల్పి
నైవేద్యముల తృప్తిపరచునారీతతికి
అన్నపానములిచ్చి ఆదుకొనియెడుతల్లి
॥శ్రీతులసి॥

# మన కర్తవ్యం

తులసిని గూర్చి ఇంతగా తెలిసిన మనం అవకాశంబట్టి కొంత కర్తవ్యమాచరించాలి.

1, వెంటనే మన ఇంటియందు తులసిమొక్క నాటాలి.

2. స్నానం చేయగానే దానికి నీరుపోసి ఒక్క పూవు పెట్టి ఒక్క ప్రదక్షిణం చేసి నమస్కరించాలి.

3. సమీప గృహాలలో, శక్తివుంటే గ్రామంలో అన్ని ఇండ్లలో తులసి నాటించే ఉద్యమం నిర్వహించాలి.

4. గృహిణిద్వారా నిత్య పూజాకార్యక్రమము జరిగేట్లుచూడాలి పర్వదినాలలో విశేషపూజలు, వ్రతం ఆచరించి తులసి విశిష్టత చాటి చెప్పాలి.

విశేష కృషి:-

పర్వదినాలకు, నూతన సంవత్సర శుభాకాంక్షలకు, శుభ కార్యాలకు ఎంతో ఖర్చుపెడుతూ ఉంటారు. ఆ ఖర్చులో సమాజాని కుపకరించేది, ఉపదేశాత్మకమైనది ఎంత ఉంటుంది? అలా కాక కలకాలం నిలిచే పుణ్యకార్యం చేస్తే ఎంత బాగుంటుంది? ఏదో ఒక శుభ సందర్భంగా మీ ఇరుగు పొరుగు స్త్రీలందరకు తులసి పుస్తకాలు బహూకరించే ప్రయత్నం ఒక్కసారి చేయండి రు 300/- ఈయగల్గితే మీ పేర శ్రీ ______ గారు ______ సందర్భముగా బహూకరించిన గ్రంథం అని 100 కాపీలు ముద్రించి పంపుతాము. అలా కలకాలం ఆ మహిళా మతల్లులు మీ పేర బహూకరింపబడిన గ్రంథంతో తులసి నారాధించే అవకాశము కల్గించండి. లేదా మీ సమీపంలో నున్న ధనవంతులద్వారా అయినా ఆపనిచేసి తులసి ప్రచార మహత్కార్యంలో భాగస్వాములు కండి.

## "హనుమద్విషయ సర్వస్వం"

## చదివారా?

హనుమంతునిగూర్చిన ముఖ్యవిషయాలన్నిటితో బాటు సర్వవిధ ధ్యానాలు, విశేష పారాయణలు, ఫలితాలు సహస్రనామం సువర్చలాష్టోత్తరంతో సహా పూజావిధానం, అన్నీ ఉన్నాయి. మీరెన్నడూ వినని హనుమద్రహస్య విషయాలెన్నో ఉన్న ఈ గ్రంథం వెల రు 8/- మాత్రమే.

..........